“ తను విస్తారే ” అను విస్తారార్థక తను ధాతువు నుండి వ్యుత్పన్నమైన తంత్ర శబ్దమునకు ‘విస్తరింపఁబడినది’ అను అర్థము ఏర్పడును. ఈ యర్థము యౌగికము. ‘రహస్యములైన యుపాసనాదులను బోధించునది’ అను అర్థము నేడు రూఢమై యున్నది. కాని ప్రాచీన కాలమున ఈ శబ్దము శాస్త్ర శబ్దమునకు పర్యాయముగా నుపయోగింపఁబడినట్లు కనబడుచున్నది. పాణినీయం ‘తంత్రమ్’ అన్న ప్రయోగమున వ్యాకరశాస్త్రము తంత్రముగా వ్యవహరింపఁబడినది. మీమాంసా శాస్త్ర సిద్ధాంతములను బోధించునొక గ్రంథమునకు ‘తంత్ర సిద్ధాంథ రత్నావళి’ యని పేరు గలదు. ఇదిగాక రహస్యములైన యొత్తుగడలు కుట్రలు మొదలగు నర్థములలో కూడా తంత్ర శబ్ధము నుపయోగింపఁబడినది. నేడును ఉపయోగింపఁ బడుచున్నది. మహ్వర్థకమైనను ప్రస్తుతము ‘రహస్యోపాస నాదులను బోధించు శాస్త్రము’ అను అర్థమునందే ఈ తంత్ర శబ్దము ఉపయోగింపఁబడుచున్నది.

అవైదికములైన యుపాసనా ప్రక్రియల బోధించు శాస్త్రములే తంత్రములు అనునొక యభిప్రాయము నేడు కొందఱిలో వ్యాపించియున్నది. ఈ యభిప్రాయమున కనుగుణములైన వాక్యములు కొన్ని తంత్ర గ్రంథములందు కలవు. క్రియాసారమన - వీరశైవ తంత్ర గ్రంథమందు తాంత్రికి వైదికి అని విద్య ద్వివిధముగా విభజింపఁబడినది. ఈ విభాగము తాంత్రిక విద్య వేద విద్యకు విలక్షణమని సూచించుచున్నది. అవైదికములగుటచే తంత్రములు అప్రమాణములు అని కొందఱనగా అవైదికములైనను ప్రమాణములే అని మరికొందఱందురు.

వేదమునకు ప్రామాణ్యము స్వతస్సిద్ధము, వేదము అపౌరు షేయము కనుక భ్రమాదిదోష దూరమగుటచే వేదప్రామాణ్యము శంకనీయముకాదు. అని కొందఱి తాత్పర్యము.

వేదమునుకు ప్రామాణ్యము స్వతస్సిద్దముకాదు. భ్రమ ప్రమాణములు లేని యధార్థ వక్తయగు పరమేశ్వరునిచే చెప్పబడినందుననే వేదమునకు ప్రామాణ్యము సిద్ధము అని మరికొందరి తాత్పర్యము. వీరి ననుసరించినచో వేదముతోపాటు తంత్రములకును ప్రామాణ్యము నంగీకరింపవలసియేయుండును. పెక్కు తంత్రములలో నవి పరమేశ్వరోక్తములుగానే వర్ణింపఁబడియుండుటచే తంత్ర ప్రామాణ్యము నిరాకరించుటకు కారణము కనఁబడదు.

వేద ప్రామాణ్యము స్వస్సిద్ధమని యంగీకరించినను తంత్రములు వేదానుకూల విషయములనే యధికముగా బోధించుటచే వేదమలకములనియు అందుచేత ప్రమాణములనియు చెప్పుట కాక్షేపమేమియు కనఁబడదు.

కావుననే వేదములతోపాటు తంత్రములును ఆగమములని పేర్కొనఁబడినవి. వేదప్రామాణ్యము నంగీకరించని జైనులూగమ ప్రామాణ్యము నంగీకరించినారు. వీరికి ప్రమాణములైన ఆగమములు వేదములు కావని వేరుగా చెప్ప నక్కఱలేదు. అని జైనాగమములనుట స్పష్టమే కదా!

ఇదిగాక రహస్యములైన యుపాసనాదులు కొన్ని వేదములలోనే నిరూపింపఁబడి యుండుటచే తంత్ర విద్య వేద విలక్షణ మనుటయు అనుపపన్నమే. వ్యాకణాది శాస్త్రములు వేదమూలకములగుటచే ప్రమాణములైనట్లే తంత్ర గ్రంథములును వేదమూలకములగుటచేతనే ప్రమాణములని కొందరు తంత్ర వేత్తలు భావించెదరు. వేద మూలకములుకాని జైనాది తంత్రములు వేద విరుద్దములు అప్రమాణములును. అట్లే వేద విరుద్ధములైన రహస్యో పాసనాదులను వివరించు క్షుద్ర తంత్రములను అప్రమాణములు-అవి వీరి యభిప్రాయమై యున్నది. ఇంతేగాక వీరు తమ తంత్ర గ్రంథములలోని విషయములెల్ల వేదమూలములని అయా విషయములకు మూలములుగా కొన్ని వేద

మంత్రములను పేర్కొని వానిని తత్త్వతి పాదకములుగనే వాఖ్యానించినారు. ఇట్టి వారిలో ప్రధానముగా పేర్కొనదగినవారు ప్రత్యభిజ్ఞా శైవతంత్రజ చూడామణి పరమ మహేశ్వరుడునైనను అభినవగుప్తుడు శాక్తేయ తంత్రజ్ఞ శేఖరుడైన భట్ట భాస్కరుడును.

కర్మ ప్రాధాన్యమును బోధించు జూ మిన్యాదులను కొన్ని అంశములలో వ్యతిరేఖించినను పెక్కు తంత్రములు ఉపనిషత్త్వతి పాదితమైన అద్వైతమునందు పర్యవసించునవిగాను ఉపాసనా ప్రధానములైనవిగాను మనకు తోచును.

ఉపాస్య దైవము యొక్క నామరూప భేదముననుసరించి పెక్కు తంత్రములు విస&తరించినవి. వానిలో చాల వఱకు నామావశిష్టములు, ఉన్నవానిలో వైఖానస పాంచరాత్రాది వైష్ణవతంత్రములు ప్రత్యభిజ్ఞా పాశుపదాది శైవ తంత్రములు కైలాది శాక్త తంత్రములు ముఖ్యములు. శాక్త తంత్ర శేఖరమైన శ్రీ విద్యా తంత్రమును గూర్చి వివరించుటకు పూర్వము పరిచయము కొఱకు కొన్ని గ్రంథముల పేర్కొనెదను.

1. తంత్రాభిధానము (ఇదియొకతాంత్రిక నిఘంటు గ్రంథము. దీనిలో బీజఘంటువు, ముద్రానిఘంటువు అను రెండు విఘంటువులు ముద్రింపబడినవి).

2. శ్రీ చక్ర సంభారము (ఇది యొక వజ్రయాన బౌద్ధ తంత్ర గ్రంథము).

3. షట్చక్రనిరూపణము (దీనిని పూర్ణానందస్వామి రచించినాడు. దీనికి శంకరడొక వాఖ్య రచించినాడు.)

4. పాదుకా పంచకము (కాలీ చరణుని వ్యాఖ్యతో కైవల్య కాలికా తంత్రము యొక్క రెండవ పటలమునకు గల విశ్వనాథుని టీకలోని కొన్ని యంశముల తోడను ముద్రింపఁబడినది).

5. ప్రపంచ సార తంత్రము తారానాథ విద్యారత్న సంపాదితము.

6. కులచూడామణినిగమము (గిరీశ చంద్రవేదాంతతీర్థ సంపాదితమై అక్షయకుమార మైత్రోపోద్ఘాత సమేతమై యున్నది.)

7. కులార్ణవ తంత్రము ( తారానాథ విద్యారత్న సంపాదితము)

8. కాలీవితాసతంత్రము (పార్వతీచరణ తర్కతీర్థ సంపాదితము)

9. తంత్రరాజము (దీనికి కాదిమతమను మరొక పేరుగలదు).

10. కామకలావిలాసము (పుణ్యానందస్వామి విరచితమైన కాశ్మీర సాంప్రదాయిక తంత్రమునకు సంబంధించిన గ్రంథము).

11. కౌలోపనిషత్తు ఇతర ఉపనిషత్తులు (ఈ గ్రంథమందు భట్ట భాస్కర వాఖ్యానము కొన్నింటికి, లక్ష్మీధరటీక కొన్నిటికిని ముద్రింపఁబడినది. సుందరీశ్వర తాతపాద శిష్యుడైన అప్పయ దీక్షితా చార్యుని భాష్యము

కూడా కొన్నింటికి కలదు. దీని సంపాదకుడు సీతారామశాస్త్రి ).

12. కర్పూరాది స్తోత్రమ (విమలానందస్వామి ఉపోద్ఘాతముతో "అర్థర్ అవలన్" అన తంత్ర శాస్త్రజ్ఞుడైన పాశ్చాత్య విద్వాంసుని అను వాదముతోడను కూడి యున్నది).

ఈ పన్నెండు గ్రంథములకు 'ఆర్థర్ ఆవలన్' అను పాశ్యాత్య విద్వాంసుని విమర్శనాత్మకోపోద్ఘాతములున్నవి. ఈ ఆర్థర్ ఆవలన్ మరికొన్ని తంత్ర గ్రంథముల ననువదించినాడు. మరికొన్ని తంత్ర గ్రంథములను స్వయముగా రచించినాడు. అనువాదములలో మహా నిర్వాణతంత్రము యొక్క అనువాదమైన "తంత్ర ఆఫ్ ది లిబరేషన్" అను గ్రంథము షట్చక్రనిరూపణయొక్క అనువాదమైన 'ది సర్పెంట్ పవర్' అను గ్రంథమును ముఖ్యములు.

ఇతడు మహిమ్నస్తవమును 'The greatness of Siiva' అను పేరుతో ఆనందలహరిని 'The wave of Bliss' (బ్లిస్) అను పేరుతో అనువదించినాడు. "శక్తి అండ్ శక్తి" అను గ్రంథమును కౌల సిద్దాంతములు క్రియా కలాపములు వివరించినాడు.

'క్రియేషన్ అను గ్రంథమందు తంత్ర సిద్ధాంతాను సారములగా సృష్టియెట్లు జరుగునో వివరించినాడు. " ప్రిన్సిపుల్స్ ఆఫ్ తంత్ర " అను గ్రంథమందు తంత్ర తత్వమువివరింపబడినది. (ఇది రెండు సంపుటములుగా ముద్రితము) " గార్లండ్ ఆఫ్ లెటర్స్ " అను పేరుతో ఒక మంత్రశాస్త్ర గ్రంథమును రచించినాడు. తన కుమారుడైన "ఎలన్" తో కలిసి "హిమ్స్ టు ద గాడెస్" అను పేరున తంత్ర గ్రంథములలోని కొన్ని శ్లోకములకు శంకరాచార్య రచిత శ్లోకములకును అనువాదము చేసినాడు. ఈ గ్రంథములన్నియు కలకత్తాలోని అగమాను సాధన సమితి వారిచే ముద్రింపఁబడినది.

త్రివేంద్ర మండలి ప్రభుత్వ ముద్రాలయమందు ముద్రింపబడిన అనంతశయన గ్రంధావళిలో ఆరు తంత్ర గ్రంథములు కానవచ్చుచున్నవి.

1. తంత్ర సముచ్ఛయము (నారాయణ రచితము శంకరుని విమర్శన వాఖ్యతో మొదటి ఆరు పటలములు ఒక సంపుటముగా ఏడవ పటలము మొదల పన్నెండవ పటలము వఱకు రెండవ సంపుటముగా ము&రదింపఁబడినవి).

2. ఈశాన గురుదేవ పద్ధతి. (ఇది ఈశాన శివగురుదేవ మిశ్ర రచితము. ఇది నాల్గు సంపుటములుగా ముద్రింపబడినది. సామాన్యపాదము మొదటి సంపుటమున, మంత్రపాదము రెండవ సంపుటమున, క్రియా పాదములోని మొదటి ముప్పది పటలములు మూడవ సంపుటమున, ముప్పది యొకటవ పటలము మొదలు అరువది నాలుగు పటలము వఱకు నాల్గవ సంపుటమున ముద్రింపఁ బడినది. యోగపాదము కూడా నాల్గవ సంపుటముననే ముద్రింపఁబడినది).

3. విష్ణు సంహిత.
4. వైఖానసాతమము (మరీచి రచితము).
5. తత్త్వ ప్రకాశము (భోజదేవ విరచితము. దీనికి శ్రీకుమారుని తాత్పర్య తీపికా వ్యాఖ్యానము కూడా ముద్రింపఁబడినది).

6. మహానయ ప్రకాశము. (అభినవ గుప్త విరచితము). మహానయ ప్రకాశ రచయితయగు అభినవగుప్తుడు సర్వతంత్ర స్వతంత్రుడు. ఆనంద వర్ధనుని ధ్వన్యాలోకమునకు లోచనమను పేర గొప్ప వ్యాఖ్యానమును, భరతుని నాట్య శాస్త్రమునకు అభినవ భారతి అను గొప్ప వాఖ్యానమును రచించి సాహిత్య శాస్త్ర భాష్య కారుడుగా ప్రసిద్ధి నందినాడు. ప్రత్య భిజ్ఞా శైవత సిద్ధాంత మహా గ్రంథమగు తంత్రాలోకమును రచించి పరమ మహేశ్వరుడుగా ప్రసిద్ధినందినాడు. శాక్తేయ తంత్రములో విలక్షణమైన మహానయ తంత్రమును మహానయ ప్రకాశమన గ్రంథమున వివరించి శాక్తేయ తంతమ్రులో విలక్షణమైన తంతమ్రునకు ప్రకాశుడైనాడు. మహానయ తంత్రమునకు మహార్థ చక్రక్రమ సంప్రదాయ మనియు నామంతరము కలదు. మహానయ ప్రశామును రచించుచు అభినవ గుప్తుడు మొదట అపటటంకమయ ప్రతిష్ఠాదేవికి నమస్కరించి మంగళాచరణ మొనర్చినాడు. ప్రథమొల్లాసమున సర్వపై లక్షణ్యమును, ద్వితీయోల్లాసమున పీటస్వరూపమును, తృతీయోల్లాసమున వ్యోమేశ్వరీచక్రమును, చతుర్థోల్లాసమున ప్రకాశచక్రమును, పంచమోల్లాసమున ఆనంద చమ్రును, షష్ఠోల్లాసమున మూర్తి చక్రమును, సప్త మోల్లాసమున బృంద చక్రమును అష్టమోల్లాసమున నృష్ట్యాది చక్రమును, (సృష్టి స్థితి సంహారచక్రమును) నవమోల్లాసమున అనాఖ్య చక్రమును. త్రయోదశియను పేరుగల ఏక దేవత యొక్క స్వరూపమును, నిరూపించినాడు. నవమోల్లాసమున తత్త్వా త్తత్వములను భావాత్మకముగా భావిచు జజీవన్ముక్తియని వర్ణింపబడినట్లు అనుకొనుట కవకాశము కలదు. ప్రమాతృ ప్రమాణ ప్రమేయ త్రిషటి నతిక్రమించుట చెప్పఁబడుటచే నద్వైతమునందు పర్యవసించ తంత్ర మీ మహానయ తంత్రమని భావింపనగును. ద్వైతాద్వైత విశిష్టా ద్వైతములలో మనకు పరిచితమైన నరిభాషయిందు గానరాదు. తర్కముకూడా మిక్కిలి అపరి చితముగా నున్నది. భాషసులభమైనను అతి గంభీరమగుటచేత తంత్రజ్ఞులు కాని వారికి, అత్యంత దుర్గ్రాహ్యముగా నున్నది. ఈ పేరుగల తంత్ర మొకటి కాశ్మీర ప్రాంతమున విస్తరించి యుండెనను నొక విషయమను మాత్రము గ్రహించి ప్రస్తుతము తృప్తి పడవలసి యున్నది. ఇంతకును ఈ గ్రంథము అసంపూర్ణము.

శాక్తేయ తంత్రానుసారులు ఆకార భేదము ననుసరించి వామాచారులు, దక్షిణాచారులు అని రెండు తెలగుగా నున్నారు. భైరవ కౌలాది తంత్ర గ్రంథముములు పరశురామ దుర్వాసో దత్తాత్రేయాదులచే రచింపఁబడిన కులార్ణవాది గ్రంథములును వామాచారులకు ప్రమాణ గ్రంథములు, వీరు కాళీ, శ్యామలా, వారాహీ, భిన్న మస్తా, ధూమవతీ, ప్రేత వారాహీ, చండీ, తారా, ప్రభృతి శక్తుల నారాధించెదరు. వీరిలో కొందఱు పరశురామ సూత్ర ప్రకారము తొమ్మిది మొదలుకొని పదునైదు వరకు పాత్రములను పూజా స్థానమున ఆపాదించెదరు. వామ హస్తముతో తర్పణాదులను చేయుదురు. సురా మాంసాదికమును నివేదించెదరు. దేవి యొక్క వామ హస్తమ నంద పూజను సమర్పించెదరు. ప్రత్యక్ష యోని పూజ లేర తదాకృతి పూజ నొనరించెదరు. స్వాధిష్ఠానకమలమందే బిందు స్థానమును భావించి అచటనే లయమును భావించుట వీరి అంతర్యాగ పద్ధతి. వామాచారుల గురు పరంపరలో శ్రీనాథుడు, భైరవుడు, గణపతి మొదలగు వారలు కలరు.

శుద్ధ మొదలు అనుత్తర వఱకు గల ముప్పది రెండు ఖలతోడి దీక్షితుడైన వానికే దేవి యనుగ్రహము కలుగునని యీ ముప్పది రెండు వామాచార దీక్షలను భట్ట భాస్కరులు పేర్కొనినారు. వీనిలో కొన్ని దక్షిణాచార దీక్షలలోకూడ కానవచ్చుట చేత ఈ దీక్షలు కేవల కౌల వామాచార దీక్షలు కావని, వీనిలో కొన్ని దక్షిణాచార దీక్షలు కలసి పోయినవని గుర్తింపవలసి యున్నది. మఖ యాగాదులలో పశుహవనము దోషము కానట్లు పూజాంగ మద్య మాంసాదిసేవనము దోషము కాదని వీరి ఆశయము.

శ్లో॥ సర్వేభ్యశ్చోత్తమా వేదా వేదేభ్యో వైష్ణవం పరమ్ ।
వైష్ణవా దుత్తమం శైవం శైవాద్దక్షిణ ముత్తమమ్ ॥

దక్షిణా దుత్తమం వామం వామాత్సిద్ధాంత ముత్తమమ్ ।
సిద్ధాంతా దుత్తమం కౌలం కౌలాత్పరతరం నహి ॥

శ్లో॥ అన్నింటికంటే వేదము లుత్తమములు. వేదముల కంటే వైష్ణవము,
దానికంటే శైవము, దానికన్న దక్షిణాచార (శాక్తేయ)ము, దానికంటే
వామాచారం (శాక్తేయ)ము, దానికన్న సిద్ధాంత (శాక్తేయ)ము,
దానికంటే కౌల (శాక్తేయ)ము, దానికన్న గొప్పది మరొకటిలేదు.

శ్లో॥ మద్యం మాంసతథా మత్స్యం ముద్రా మైధున మేవచ ।
మకార పంచకం చైవ దేవతా ప్రీతి కారకమ్ ॥

తా॥ మద్యమాంస మత్స్యమద్రా మైథున నామక పంచమకారములు దేవతా ప్రీతి కారకములు.

శ్లో॥ కేవలే నాద్యయోగేన సాధకో భైరవో భవేత్ ।
ద్వితీయేనచ తత్త్వేన పూజకో బ్రహ్మ రూపభాక్ ॥
కేవలేన తృతీయేన మహా భైరవ తాంద్ర జేత్ ।
చతుర్థేనచ తత్త్వేన భువి పూజక నాయక ః ॥
పరేశః పరతాం యాతి శివతుల్యస్స పాధక ః ।
పంచమేనతు వీరేంద్రః సర్వ పాపపైః ప్రముచ్యతే ॥

తా॥ కేవల మద్య సేవనము చేత సాధకుడు భైరవత్వము, కేవలమాంస భోజనముచేత బ్రహ్మ రూపమును, కేవల మత్స్య భోజనముచేత మహా భైరత్వమును, కేవలముద్రా సేవనముచేత, పరమశివ సామ్యమును, కేవలమైథున సేవనముచేత వీరేంద్రుడై సర్వ పాప విముక్తిని పొందును.

శ్లో॥ వినాపంచోపచారం హి దేవీ పూజాంక రోతియ ః ।
యోగినీనాం భవేద్భక్ష్యః పాపం చైవ పదే పదే ॥
వినామాంసేన మత్స్యేన పుంశ్చలీ సేవం వినా ।
నమంత్ర సిద్ధిఇ మాప్నోతి తస్మాద్యత్న వరోభవేత్ ॥

తా॥ మకార పంచోపచార సమీతముగ దేవీపూజ నొనర్చువాడు యోగినుల చేత భక్ష్యుడగును. అడుగడుగునకు పాపము నొందును. మాంసమత్స్య పుంశ్చలీ సేవన (మైధున)ము లేక మంత్ర సిద్ధికలుగదు. కావున పంచమతారోపచారముల సంపాదనకై సాధకుడు యత్నింపవలెను.

మద్య మాంసాదులను దక్షిణా చారులుపయోగింపరు. అందువలన వీరి యారాధనము సాత్విక మనఁబడును. వింధ్యకు దక్షిణమున గల ప్రాంతముల వారిలో నీ సాత్వికమైన శక్తి పూజ ప్రచురముగా నున్నది. అందువలన వీరి ఆచారము దక్షిణాచరమనఁబడి యుండవచ్చును. కాని ప్రస్తుత మీ దక్షిణాచార శబ్దమందలి దక్షిణ శబ్దము దిక్సంబధిగా కానరాదు. వింధ్యకు దక్షిణమునకు మద్యమాంసాది యుక్త తామ సోపాసకులుండనే యున్నారు. అదిగాక, వింధ్యకు నుత్తరమున ప్రచురముగాగల కౌలాచారమునకు ఉత్తరాచారమని పేరు రాలేదు. కాని దక్షిణ శబ్దప్రతి ద్వంద్వియైన వామ శబ్దముచే నా యాచారము విశేషింపఁబడుచున్నది.

దక్షిణ దేశమున నామాచారులున్నట్లే యుత్తర దేశమున దక్షిణాచారులును గలరు.

శ్లో॥ అభిలషిత పరస్త్రీ యోగపూజాప రోహం
బహు విధజన భావారంభ సంభావితోహం ।
పశుజన విముఖోహం బై రవీ సంయుతోహం
గురు చరణ పరోహం భైరవోహం శివోహం ॥

తా॥ నేను కామిత పరస్త్రీయోగపూజాపరుడను బహువిధ జనంభా వారంభములచే సంభావితుడను, పశుజన విముఖుడను, భైరవీ సంయుక్తుడను, గురుచరణ పరుడను, భూరవుడను, శివుడను.

పై శ్లోకమున వామాచారులు కూడా ఉపాసన విషయమున అహం గ్రహోపాసన మొనరించు దక్షిణా చారులతో విభేదించరని స్పష్టమగు చున్నది. పరస్త్రీయోగ శబ్దముచేత పై శ్లోకము వామాచార విషయమనుట స్పష్టము. అయినను అహం గ్రహోపాసనము వామాచారులలో కలదనుటను ప్రమాణీకరించుచున్నది.

ప్రతీకోపాసనయందు సిద్ధులైసవారు, అహం గ్రహోపాసన కధికారులు అగుదురు. ఎవరు అహం గ్రక్షపాసనమును అనగా ఇష్ట దేవతా తాదాత్మ్య భావమును చేయుదురో వారు శాక్తేయతంత్రాను సారముగ వీరులనఁబడుదురు.

వీరా రాధ్యా మహా వీరేంద్ర వరదా వంటి నామములు ఉభయాచారములను సవ్యావసవ్యమారస్థా దక్షిణా, దక్షిణా రాధ్యావంటి నామములచే సూచించు లలితా సహస్ర నామ స్తోత్రమున నుండుటచే, వీరభావము ఉభయాచారాను కూలమే యనియు నిశ్చయించు కొనవచ్చును.

శ్లో॥ తస్మాద్భు క్త్వాచ పీత్వాచ పూజయేత్పర మేశ్వరీమ్ ।
సత్యమేత ద్విజానీయాత్ వాక్యం శంకర భాషితమ్ ॥

తా॥ అందువలన మత్స్య మాంసముల భుజించి మద్యమును త్రాగి పరమేశ్వరుని పూజించవలెను. ఇది శంకర ప్రోక్త సత్య వాక్యమని యెఱుగవలెను.

శ్లో॥ నభుక్త్వానచపీత్వాచ నస్మరేన్నజ పేత్సదా ।
యేస్మరంతి నరామూఢా స్తేషాం దఃఖం పదే పదే ॥
ఆనందేన వినాయస్తు చండికాం పరిపూజయేత్ ।
రోగీ దుఃఖీభవేత్సోపి మృతౌచనరకం వ్రజేత్ ॥

తా॥ మత్స్య మాంసములను భుజింపక మద్యమును త్రావక ధ్యానజపముల నొనర్పరాదు. అట్లొనర్చి నరులు మూఢులు. వారికి మాటి మాటికిదుఃఖమే కలుగును. ఆనందము లేక చండికను పూజించినవాడు రోగి దుఃఖియునై చచ్చిన పిదప నరకము నొందును.

ఇంతేగాక వామ సిద్ధాంత కౌలములు వేర్వేరనియు తెలియుచన్నది. అయినను వామాచార నామ హేతువైన మద్య మాంసాది సేవనము సిద్దాంత కౌలముల యందును ఉండుటచే వామా చారులలోనే సిద్ధాంత కౌలాచారులను చేర్చుటఁజరిగినది.

దక్షిణాచార గురపరంపరలో శివుడు, నారాయణుడు, బ్రహ్మ, వసిష్ఠుడు, సనక సన దనారులు గలరు.

ఈ దక్షిణాచార సంప్రదాయ ప్రవర్తకుడు. దక్షిణామూర్తి కామేశ్వరి కామేశ్వరుల యభిన్నమైన దేవతామూర్తి యుపాస్యము. వైదిక మంత్రములు కల్పోక్త శ్లోకములు పూజాసమయమందాయా యుపచారములను సమర్పించు నప్పుడు పఠింపబడును. దక్షిణ హస్తముతోడనే పజ చేయఁబడును. క్షీరాది పానీయములు, ఫలాది భక్ష్యములు నివేదింపఁబడును.

దక్షిణా చారమున పదునారు మంత్ర దీక్షలు గలవు.

శ్లో॥ "శుద్ధా బాలాచ మాతంగీ
గురుర్గణ పతిస్తథా
సౌభాగ్య విద్యా వారాహీ
తిరస్కరణికీ తథా
లోపాముద్రా తురీయాచ
ప్రాసాదాసహషోడశీ
శ్రీ పరా షోడశీ చైవ
శ్రీ మహా పాదుకా తథా "

అను పదునారు మంత్ర దీక్షలలో దీక్షితుడైనవాడే శ్రీదేవీ యను గ్రహమును పొందగలుగును. క్షత్రియాదులు మద్య మాంసాదులు నివేదించినను, అది దక్షిణా చారమేకాని బ్రహ్మణులపట్ల పూజించుట మాత్రము వామ్మాచారమే అనియు కొందఱభిప్రాయపడుట గలదు.

శ్రీరామకృష్ణ పరమహంస ఈ వామ దక్షిణో భయ మార్గములలో దేవి నారాధించినారని చెప్పికొనుట గలదు.

శాక్తేయ తంత్ర విద్యా ప్రబోధ ముపనిషత్తుల వలననే ప్రథమముగా కలిగినదని తద్విద్యా వేత్తల నిర్ణయము. శాక్తేయ తంత్ర విద్యా ప్రబోధకములైన యుపనిషత్తులలోనే ఈ వామ దక్షిణాచార మార్గద్వయ ప్రామాణ్యము గోచరించును. వానలో కౌలోపనిషత్తు కైలమార్గమునకు చెందినదని యాపేరే చెప్పుచున్నది. ఉభయాచారులకును ముఖ్య ప్రమాణమగు త్రిపురోపని షత్తులో,

శ్లో॥ పరి స్రుతం ఝష మాజం పలంచ
భక్తాని యోనీస్సు పరిష్కృతాని
నివేదయన్ దేవతాయై మహత్యై
స్వాత్మీ కృత్య సుకృతీ సిద్ధమేతి

(పరిస్రుత మనా సుర. ఝషమనగా చేప. అజం, పలం అనగా మేక మాంసము, భక్తాని అనగా సెనగలు పెసలు మొదలగు పప్పులతో కలిపి వండిన పులగము పులిహోర మొదలగు చిత్ర విచిత్రాన్నములు, యోనీః అను పదము బ్రాహ్మణ క్షత్రియాది జాతులను సూచించున. తాత్పర్య మేమనగాఅన్ని జాతుల వారును పైన చెప్పఁబడిన పదార్థముల మహా దేవత కొఱకు నివేదించి సిద్ధిని పొందెదరు) అను మంత్రము పరిస్రుత ఝషాజ పలములు నివేదనీయములని చెప్పుచున్నది. కాని దక్షిణాచార పరాయణులు పరిస్రుత మనగా జ్ఞానమని, ఝషమనగా జీవభావమని. అజపల మనగా మూల ప్రకృతికి సంబంధించిన

ఇంద్రియ సముదాయమని, అర్థములు చెప్పి వీనిని నివేదించి సిద్ధిని పొందెదరు అను విదముగా నీ మంత్రమును వ్యాఖ్యానించెదరు.

పరమ ప్రామాణిక శాక్త తంత్రజ్ఞుడను పరశ్శత తంత్ర గ్రంథకర్త యునునగు భట్ట భాస్కరుడు మాత్రమీ మంత్రమును పంచమకార సమర్పణ పరముగానే వ్యాఖ్యానించెను. కౌలో పనిషత్తులోని 'ధర్మ విరుద్ధాః కార్యః' అను సూత్రమును వ్యాఖ్యానించుచు, సురాపానాదులు కౌలాచార పూర్ణాంగములుగా విహితములనియే చెప్పెను.

సూత్రాత్మకమైన కౌలో పనిషత్తు రహస్యమైన ఈ ధర్మమును మరింత రహస్యముగా స్థూల దృష్టికి భ్రామకముగా భోదించచున్నది. మధ్య మధ్య ఉపక్రమ విరుద్ధార్థ స్ఫూర్తిని కలిగించు వాక్యములుండటచే భ్రాంతి కవకాశము కలుగుచున్నది.

కౌ లో ప ని ష త్తు

ఆథాతో ధర్మ జిజ్ఞాసా, జ్ఞానం బుద్ధిశ్చ జ్ఞానం మోక్షైక కారణమ్, మోక్షస్సర్వాత్మతాసిద్ధిః పంచ విషయాః ప్రపంచః తేషాం జ్ఞానం స్వరూపం.

అధర్మ కారణా జ్ఞానమేవ జ్ఞానమ్. ప్రపంచ ఈశ్వరః అనిత్యం నిత్యం, అజ్ఞానం జ్ఞానం, అధర్మ ఏష మోక్షః, పంచ బంధా జ్ఞాన స్వరూపాః పిండాజ్జననమ్. తత్రైవ మోక్షః

ఏతద్ జ్ఞానమ్. సర్వేంద్రియాణాం నయనం ప్రధానం. ధర్మ విరుద్ధాః కార్యాః ధర్మ విహితా నకార్యాః సర్వం శాంభవీ రూపమ్.

ఆమ్నాయా నవిద్యంతే. గురురేకః వస్త్వైక్యతా బుద్ధిమంతే. ఆ మంత్ర సిద్ధేః మదా దిస్త్యాజః.

ప్రాకట్యం నకుర్యాత్. నకుర్యాత్ పశుసంబాషణమ్ అన్యాయోన్యాయః. నగగణయేత్కమపి. ఆత్మరహస్యం నవదేత్. శిష్యాయవదేత్, అంతః శాక్తః బహిః శైవః లోకే వైష్ణవః. అయమేవాచారః. ఆత్మజ్ఞానాన్మోక్షః లోకాన్న నింద్యాత్. ఇత్యధ్యాత్మమ్ః వ్రతం నచరేత్. నతిష్ఠేన్నియమేనం నియమాన్న మోక్షః. కౌలప్రతిష్ఠా నకుర్యాత్ సర్వ సమోభవేత్ సముక్తోభవేత్.

అధర్మమనగా ధర్మ రహితమైన బ్రహ్మము. ధర్మమనగా శక్తి. జ్ఞానమనగా మిథ్యాజ్ఞానము అని గ్రహించి సమన్వయము చేసికొనవలయును. ఇట్లే అన్యాయోన్యాయః అన్నప్పుడు తర్క మూలమైన న్యాయాన్యాయముల వ్యవస్థ అసంపూర్ణమై నందున సర్వమును సహింప వలెనని బోధించు వాక్యముగా సమన్వయించు కొనవలెను. అమ్నాయాన విద్యంతే అను వాక్యమునకు సర్వాపరోక్ష బ్రహ్మమును బోధించుటకు వేదములు ప్రవర్తింపఁజాలవని యర్థము గ్రహింపవలెను. దర్మ విరుద్ధా : కార్యా : అనగా దేవనివేదిత మద్యాది సేవనము చేయదగినదని, ధర్మ విహితాన కార్యాః అనగా ఆసకుడు వేదవిహిత ధర్మరూపములైన జ్యోతిష్టోమాది మజ్ఞములను చేయరాదని గ్రహింపవలెను.

ఇట్లు కౌలోపనిషత్తు వామాచారమును భోధించుచునే యుపాసకుని యుత్తమ లక్షణములను గూడా బోధించు పద్ధతి ఉపనిషత్తు లందే యారంభింపబడినది. అనధికారులు సామాన్య ధర్మ పరిజ్ఞాన మాత్రము గలవారు ఇందు ప్రవేశింపకుండ నుండవలెననుటయే ఇట్లు బోధించుటలోని రహస్యము.

అధర్వణ వేదీయ సౌభాగ్య కాండమునకు చెందిన త్రిపురోపనిషత్తు భావనోపనిషత్తు, యజుర్వేదమునకు చెందిన అరుణోపని షత్తును, శాక్తే యోపాసనా ప్రతీకలలో అతి ప్రసిద్ధమన శ్రీ చక్రమును వర్ణించుచున్నవి. శ్రీ చక్రము ఉపాస్యమూన పరదేవత యొక్క అర్చారూపమునకు బ్రహ్మాండాత్మక రూపమనకు మంత్రమునకు ఉపాసకుని పిండాండమునకు గురు స్వరూపమునకును సంకేత రూపమ్మై యున్నది. ఈ క్రింది శ్లోకమున సంగ్రహముగా శ్రీ చక్ర మధ్ధరింపబడుచున్నది.

బిందు త్రికోణ వసుకోన దశార యుగ్మ
మన్వస్ర నాగదళ షోడశ పద్మ యుక్తమ్
వృత్త త్రయంచ ధరణీసదన త్రయంచ
శ్రీ చక్ర రాజ ఉదితః పర దేవతాయాః.

శ్రీ చక్ర మందలి తొమ్మిది చక్రము లిందు పేర్కొనబడినవి. అవరోహణ క్రమమున వాని పేర్లివి. 1. బిందు చక్రమ, 2. త్రికోణ చక్రము, 3. అష్టకోణ చక్రమ, 4. దశార చక్రము, 5. షొడశార చక్రము, 6. మన్వస్ర చక్రము, 7. అష్టదళ చక్రము, 8. షొడశ దళ చక్రము, 9. భూగృహ చక్రము.

త్రిపురోపని షత్తులోని మొదటి మంత్రము బిందు చక్రమును, రెండవ మంత్రము ద్వితీయ తృతీయ చక్రముల సమిష్టి రూపమైన నవయోన్యాత్మక చక్రమును, మూడవ మంత్రము చతుర్థ పంచమ షష్ఠ చక్రముల సమిష్టి రూపమగు సృష్టి చక్రమును, ఐదవ మంత్రము నవమ చక్రమును బోధించుచున్నది. మొదటి మూడు చక్రములకు సంహార చక్రమని పేరు. ఇట్లు శ్రీ చక్రమును సంహారస్థితి సృష్టి చక్ర త్రయాత్మకముగా చెప్పవచ్చును. ఆఱవ మంత్రము పరదేవత యొక్క విభిన్న నామములను, ఏడవ మంత్రము శ్రీ చక్ర విజా&ఒన ఫలమును, ఎనిమిదవ మంత్రము పంచ దశాక్షర మంత్రమును బీజ సంకేతముల ద్వారా చెప్పును. ఈ పంచ దశాక్షరము కామ రాజోపాసిత విద్యా స్వరూపము. తొమ్మిదవ మంత్రములో సాముద్రోపాసిత విద్యా స్వరూపమును బోధించును. కామ రాజోపాసిత పంచ దశాక్షర మంత్రములోని మొదటి మూడక్షరముల తొలగించి వాని స్థానమున దానిలోని షష్ట సప్త మాష్టమాక్షరముల నివేశించి కూర్చబడిన పంచ దశాక్షర మంత్రమే లోపాము ద్రోపాసిత విద్య. ఈ రెండు విద్యలకు భేద మిత్ర మాత్రమే. పదవ మంత్రము మనమున చింతింపఁబడిన సగుణ పరదేవతను బాహ్య శ్రీ చక్రమందు ధ్యానివచవలెనని బోధించును. పదునొకండవ మంత్రమ పరదేవత యొక్క సగుణ స్త్రీ పుం రూపముల యైక్యమును, పదునైదవ మంత్రము నిర్గుణ ధ్యాన ఫలమును, పదునాఱవ మంత్రము ఈ ఉపని షత్ప్రాశస్త్యమును బోధించును.

భావనోపనిషత్తు జగత్తును శ్రీ చక్రముగా భావించు విధానమును తెలుపుచున్నది.

శ్రీ చక్రారాధన విధానమున ఉపాసక శరీరగత తజ్జన కాంశాస్థి మాంసాదులను అంగదేవతయైన వారాహిగా, ఉపాసక శరీరగత తజ్జనన్నం శాస్థిమాంసాదాలును అంగదేవతయైన కురుకుల్లగా, ధర్మార్థ కామ మోక్ష రూపములైన ఉపాసకుని పురుషార్థములను సముద్రములనుగా, దేహమును, నవరత్న దీపమనగా, సంకల్పములను కల్ప వృక్షములునుగా, మనస్సను కల్ప కోద్యానమునుగా, షడ్రుచుల షడృతువులనుగా, కామ క్రోధలో భమోహ మద మాత్సర్య పుణ్య పాపములను బ్రాహ్మ్యా ద్యష్ట శక్తులనగా, పంచ భూత పంచ జ్ఞానేంద్రియ పంచ కర్మేంద్రియ మనో వికారములను, కామా కర్షిణ్యాది షొడశ శక్తులనుగా, వచనాదాన విసర్గానంద రూప పంచ విషయ సహిత హానోపాదానో పేక్షారూప బుద్ధి త్రయమును అనంగ కుసుమాద్యష్ట శక్తులనుగా, దశ ప్రాణములను సర్వసిద్ధి ప్రదాది బహిర్దశార దేవతలనుగా, అలంబుసాది చతుర్దశ నాడులను సర్వసంక్షోభిణ్యాది చతుర్దశ శక్తులనుగా,

దళ జఠరాగ్ని కళలను అంతర్దశార దేవతలనుగా, శోతోష్ణ సుఖ దుఃఖేచ్ఛా సత్త్వ రజ స్తమ మస్సులను వశిన్యా దృష్ట శక్తులనుగా, అవ్యక్త మహాదహంకారములను కామేశ్వరీ వజ్రేశ్వరీ భగమాలినులనుగా, పంచతన్మాత్రలను పంచపుష్ప బాణములనుగా, మనస్సు నిక్షుధనువునుగా, రాగమును పాశమునుగా, ద్వేషము నంకుశమునుగా, నిరపాధిక జ్ఞానమును కామేశ్వరునిగా, స్వాత్మను లలితా పర దేవతగా భావిచుట ప్రధానమూన విషయము.

బాహ్యోపచారములతో చేయఁబడు హోమ పూజారులు బహిర్యాగమన బడును. అంతర్యాగమున బాహ్యోపచరాముల యావశ్యకతలేదు. ఇందు జ్ఞానమే అర్ఘ్యము, జ్ఞేయమే హవిస్సు, జ్ఞాతయే హోత, జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయా భేద భావనయే అంర్యాగమున అత్యంతా వశ్యకము. దీనియందు నేను నీవు అన్నదిలేదు. కర్తవ్యము అకర్తవ్యము. ఉపాసితవ్యము అనుపాసితవ్యము అను వికల్పముల నాత్మయందు లీనములుగా భావించుట హోమము. భావనా విషయా భేధ భావనమే తర్పణమ అని భావనోపనిషత్తు అంతర్యాగ విధానమును విశదీకరించును. ఈ భావనోపనిష దర్ధమనే తంత్ర రాజమను &రగంథ రాజము విస్తరింంచును.

అరుణోపనిషత్తు ఈ క్రింది మంత్రము చేత శ్రీ చక్రమును వర్ణించును.

శ్లో॥ అష్టా చక్రానవద్వారా దేవానాం పూరయోధ్యా
తస్యాం హిరణ్మయజ కోశ : స్వర్గలోకో జో&యతి షాదృత :

ఒక అష్టకోణము రెండు దశకోణములు ఒక చతుర్ధశి కోణము ఒక అష్టదళము ఒక షోడశదళము ఒక త్రివలయము ఒక త్రిచక్రము అను నీ అష్ట చక్రములతోడ తొమ్మిది ద్వారముల తోడను గూడిన శ్రీ చక్రము దేవతలకు మరియు పంచ వింశతి తత్త్వములకు అధిష్ఠానము. మంద భాగ్యలకు అది అయోధ్య అనగా సాధింపరానిది. దానయందు సహ స్రదళ కమలమనెడు హిరణ్మయి కోశము బిందు స్థానమందు విరాజిల్లు చున్నది. దాని తేజస్సు చేత స్వర్గలోకము ప్రకాశించుచన్నది. అని పై మంత్రము యొక్క తాత్పర్యము ఈ అరుణోపని షత్తులోని ఈ క్రింది మంత్రము.

శ్లో॥ "విభ్రాజమానాం హరిణీం యశ సాసంపరీ వృతామ్
పురం హిరణ్మయీాం బ్రహ్మా వివేశాం పరాజితీ"

శ్రీ చక్రమందు శివశక్తులు నివసించి యుండుటను చెప్పను. బిందు రూపమైన చింతామణి గృహమున నున్న శివుని షట్చక్రముల భేదించుచు, మాటి మాటికి కుండలినీ శక్తి చేరునని యీ మంత్రము యొక్క భావము.

ఋగ్వేదమునకు చెందిన బహ్వృ చోపనిషత్తు ఈ శ్రీ విద్యకును బృహదారణ్యకాద్యు పనిషత్తులలోని మహా వాక్యముల ద్వారా బోధింపఁబడిన జీవ బ్రహ్మైక్యమునకును ఏక వాక్యతను కూర్చును.

పైన పేర్కొనబడిన త్రిపురారుణ భావనా బహ్వృచోపని షత్తులే కాక అద్వైత భావనా కౌలోపనిషత్తులును ఈ విద్యకు ప్రమాణములై యున్నవి.

పై యుపని షత్తులలో త్రిపురా అరుణా ప్రభృతి శబ్దముల చేత తంత్ర గ్రంథములలో కామేశ్వరీ

పరదేవతా రాజరాజేశ్వరీ లలితా ప్రభృతి శబ్దముల చేతను, ప్రతిపాదింపబడిన శ్రీదేవి స్థూల సూక్ష్మపరములను మూడు రూపములలో వర్ణింపఁబడుచుండును. కరచరణాదులు కలది స్థూల రూపము. మంత్రమయము సూక్షరూపము, జ్ఞానమయము పరరూపము. మరల సూక్ష్మ రూపము సూక్ష్మ సూక్ష్మతర సూక్ష్మతమములను మూడు విధములుగా నున్నది.

సూక్ష్మ రూపము పంచదశీ మంత్రము. సూక్ష్మ తరము కామకల సూక్షతమము నాదము. సూక్ష్మమైన పంచదశీయంద మూడుకూటములు కలవు. వాగ్భవ కూటము, మధ్యకూటము శక్తికూటము, సూక్ష్మతరమైన కామకలగైడ ఆగమములందు మూడు విధములుగా వర్ణింపబడినది. (1) అహమను ఆత్మ మంత్రము. (2). ఈంకారము (3) శ్రీం. వీనిలో చివరి దానికే షోడశి యని పేరు. సూక్ష్మమైన పంచదశీ మంత్రము దీని యందు లీనమై యున్నది.

విశుద్ధాత్మయే పరరూపము. స్థూల రూపము స్పష్టమైనదే కావున వివరింప నక్కఱలేదు.

శ్రీదేవీ ప్రతీకమైన శ్రీ చక్ర మండలి మధ్య బిందువు పరారూప ముగా దానియొక్క వికాసమైన త్రిభుజ చక్రము పశ&యంతీ రూపముగా అష్టకోణ చక్రము మధ్యమా రూపముగా మిగిలిన చక్రముల సముదాయము వైఖరీ రూపముగా, శ్రీదేవి వాఙ్మయ స్వరూపము గ్రహింపఁదగినది.

అర్థ ప్రపంచ మంత్రయు వాక్కు నుండియే యేర్పడిన దనుట శ్రీ విద్యా తంత్ర సిద్ధాంతము. ఈ సృష్టి వృక్షమునకు ఈ చక్ర మధ్య బిందువు బీజముగా అందలి శివశకి& ద్వయస్థితి దళ ద్వయముతో కూడిన అంకురముగా వర్ణింపఁబడినది. బీజమునందు అంకురమిమిడి యుండుట సహజము. కావున శివశక్తుల ఏకాకారమైన పరబ్రహ్మ స్వరూపము పరారూపమైన ఈ బిందువు స్ఫుటితమై పశ్వంతీ మధ్యమా వైఖరీ రూప సంహారస్థితి సృష్టి చక్రములుగా పరిణమించినది.

సాధకుడు శ్రీ చక్రసంకేతముల నెఱిగి శరీర మందున్న మూలాధారాది సహ స్రారాంతస్థూల చక్రములందు శ్రీ చక్రమును భావించుట యొక్క సామరస్యము భ్రూమధ్యము నుండి యున్మన్యంతము వఱకుగల సూక్ష్మచక్ర ములందు శ్రీచక్రమును భావించుట మరోక సామరస్యము. కేవల బిందువు నందు శ్రీ చక్రము నంతయు భావించుట ఇంకొక సామరస్యము. శ్రీ త్రివిధ సామరస్యములతో ఉత్తరోత్తరము ఉత్తమము. ఇట్లు త్రివిధ సామరస్యమును భావనోపనిషత్తు ననుసరించి భావించి ధ్యానించుట అంతర్ముఖుడై అంతరంగ విచారణచేసి సహస్రార కమలమునందు చక్రైక్యమును బిందు మండలమందు చిచ్చంద్రునితో పరాశక్తి వహ్న్యైక్యమును అందు బ్రహ్మాత్మైక్యము నుభావించి ధ్యానించు అంతర్యాగము. ఇట్టి అంతర్యాగమే సమయాచార మనఁబడును. ఇది ఉన్నత శ్రేణికి చెందిన దక్షిణాచార సాధకుల సముదాచారము. శ్రీ లలితా సహస్రనామముల యందు దేవి సమయాచార తత్పరయని పేర్కొనఁ బడినందున సమయాచార సాధకులే శ్రీదేవీ కరుణాపాత్రులని నిశ్చయింపఁబడుచున్నది.

సమయశబ్దము తంత్ర &రగంథములందు ప్రకాశవిమర్శలుగా పేర్కొనబడిన శివశక్తులకు గల పంచవిధ సామ్యములను బోధించును.

(1) అధిష్ఠాన సామ్యము. అధిష్ఠాన పదముచేత శ్రీచక్ర బ్రహ్మాండ పిండములలో దేనినైన గ్రహింపవచ్చును. ఈ మూడింటిలో దైనను శ ఇవునకు శక్తికని అధిష్ఠాన మైనందున వీరికి అధిష్ఠాన సామ్యము కలదు.

(2) అనుష్ఠాన సామ్యము. అనుష్ఠాన పదము సృష్టిస్థితి సంహార అనుగ్రహ తిరోధానములను పంచ కృత్యములను బోధించును. శివుడును శక్తియును ఈ పంచ కృత్యములననుష్ఠించుట చేత వీరి కనుష్ఠాన సామ్యము కలదు.

(3) అవస్థాన సామ్యము. అవస్థాన పదము సచ్చిదానంద స్థితిని బోధించును. శివుడు శక్తియు సచ్చిదానందరూపులే యగుటచేత వీరికి అవస్థాన సామ్యము గలదు.

(4) నామ సామ్యము. నామ పదము "శివాశివ," "ఈశ్వరీ ఈశ్వర" ప్రభృతి నామ ద్వంద్వముల ఏకశేషమైన శివ ఈశ్వర ప్రభృతి నామములను బోధించును, ఒకే శబ్దము లింగభేదముచే వీరిని బోధించుటచే వీరికి నామ సామ్యము కలదు.

(5) రూప సామ్యము. రూప పదము త్రినేత్ర చంద్రశేఖర త్వాది విశిష్ట రూపమును బోధించును. శివుడు త్రినేత్రుడు, శక్తియు త్రినేత్రమే. శివుడు చంద్రశేఖరుడు శక్తియును చంద్రశేఖరయే అందుచే వీరిరువురికి రూప సామ్యము కలదు.

శివశక్తులకే పంచవిధ సామ్యములను భావచుట సమయాచారము. దీని నాచరింఉ సాధకులు శ్రీదేవీ కరుణాపాత్రులగుదురనుటలో సంశయము లేదు.

శక్తి పరిణామ రూపమైన శరీరత్రయము నంద భిమానముచే దుఃఖితుడగు జీవుడు పరాకృత సకృతపరిపకమున శ్రీ విద్యా తంత్ర పరిజ్ఞానము కలవాడ ప్రాణవాయు నిరోధాభ్యాముకలవాడూ మూలాధార చక్రమందు సుప్తమైన కుండలినీ శక్తిని మేల్కొలుపును. అపుడాశక్తి సుషుమ్నా మార్గమున ఏర్ధ్వముఖముగా ప్రసరించుచు మూలాధారాది షట్చక్రములను బ్రహ్మ, విష్ణు, రుద్ర గ్రంథిత్రయమును భేదింఇచి సహస్రసారమను స్వస్థానమును పొందును.

మూలాధార స్వాధిష్ఠాన చక్రద్వయు రూపమైన బ్రహ్మ గ్రంథిని భేదించగా స్థూలశరీరాభిమానము నశించును. మణిపూరానాహత చక్రద్వయ రూపమైన విష్ణు &రగంథిని భేదించగా సూక్ష్మశరీరాభిమానము నశించును. విశుదాజ్ఞా చక్రద్వయ రూపమైన రుద్రగంథిని భేదించగా కారణ శరీరాభిమానము నశించును.

ప్రాణవాయు నిరోధాభ్యాసము లేకున్నను శ్రీదేవీయనుగ్రహమున లభించిన యాత్మా నాత్మ విచారణచేత గూడనీశరీర త్రయాభిమానము నశింప వచ్చును.

కుండలినీ శక్తి సహస్రారమును చేరుటతో స్వస్థానమును చేరినందున ప్రయాణము పూర్తియగును. జీవుడు స్వస్వరూప ప్రకాశ ప్రవిష్టుడగుటచే దుఃఖము పూర్తిగా తొలగి యానందైకరూప స్వస్వరూపావస్థితి ననుభవించును.

ఇట్టి యానందస్థితి ఆత్మానాత్మ విచారణైక గమ్యమే యని వేదాంతులు ప్రాణాయామాది యోగసాధన చేతనేయని యోగులు ఉపాసన చేతనేయని ఉపాసకులును చెపుదురు. వేదాంతులు యోగసాధనలను ఉపాసనలను చిత్తశుద్ధి కంగములుగా గ్రహించి యున్నారు. యోగులు హఠయోగ రాజయోగ భేదమున మార్గద్వయము నాశ్రయించి యున్నారు. ఈశ్వర ప్రణిధానాద్వా అను,

పాతంజలయోగ సూత్రము ఈశ్వర ధ్యానము ప్రాణాయామాదులతోపాటు చిత్తైకాగ్ర్య సాధనముగా చెప్పుచున్నది. చిత్తైకాగ్ర్య హేతువైన ఈ యుపాసనము సాత్త్విక రాజస తామస భేదమున త్రివిధము - (1) బాహ్య విగ్రహములందు దేవతాభావన తామసము (2) హృదయమునందు దేవతా భావన రాజసము (3) స్వాత్మయందు సాక్షాతాభావన సాత్త్వికము, అధికారి భేదమున నీత్రివిధోపాసనమును క్రమోన్నతి కారణమగును. వేదాంతులకు గాని యోగులకుగాని ఉపాసకులకు గాని చిత్తైకాగ్ర్య మావశ్యకము. ఆ చిత్తైకాగ్ర్యమున కీశ్వరానుగ్రహము హేతువనియు వీరందఱును అంగీకరించెదరు. ఈశ్వరానుగ్రహము ఉపాసనా లభ్యము. కావున ఉపాసము నిరపాయమ్మైన నిశ్చిత ఫలమైన మార్గము కావున శ్రీవిద్యా తంత్రమున జ్ఞానము ధ్యానము ప్రాణవాయు నిరోధాభ్యాసము మంత్రజప హోమాది క్రియాకలాపము మొదలగు ప్రక్రియలన్నింటి సమన్వయము భాసించును.

శ్రీదేవి యొక్క స్థూలకర చరణాది యక్త రూపమును లేక శ్రీచక్రమును బాహ్యోపచారముల చేతగాని మనఃకలి&పతోప చారముల చేతగాని బాహ్యవిగ్రహమునగాని మనస్సునందలి బావనామయ వి&రగహమునగాని పూజింపవచ్చును.

శ్రీదేవి యొక్క మం&రతాత్మకమైన సూక్ష్మరూపమున స్థూలరూపా భిన్నముగ భావించుచు జపించవచ్చును లేక శ్రీచక్రమును బ్రహ్మాండాత్మ కముగా గాని పిండాండాత్మకముగ గాని మంత్రాత్మకముగ గాని ధ్యానింప వచ్చును.

ఇదంతము ప్రతీకోపాసనా ప్రకారము. స్వభిన్న వస్తువునందు పరమాత్మనుపాసించుట ప్రతీకోపాసనము-ఈ ప్రతీకోపాసనమున కన్న అహంగ్రహోపాసనము శ్రేష్ఠము. తనయందే పరమాత్మనుపాసించుట అహగ్రోహోపాసనము.

జన్మాంతరో పాసనా ఫలముగ లభించిన తత్త్వజిజ్ఞానచే శ్రీదేవి యొక్క జ్ఞానాత్మకమైన పరరూపమున స్వాభిన్నముగా తెలుసుకొని ముకి&తని పొందుటయూ సాధ్యమే అద్వైతా చార్యుంఱును శ్రీవిద్యోపాసకులే, లలితా సహస్రనామము లందలి దక్షిణామూర్తి రూపిణీయను దేవీనామము శ్రీవిద్యా ప్రవర్తకులలో శిమూర్తియైన దక్షిణామూర్తిని పేర్కొనుచున్నది. ఆయన జ్ఞానముద్ర జీవ బ్రహ్మైక్యమును శివశక్త్యైక్యమును బోధించును. హయగ్రీవుడీ విద్యను. అగస్త్యునకు పదేశించెను. పరంపరాక్రమమున గైడపాదా చార్యులు శ్రీశంకచార్యులు విద్యారణ్యులు శ్రీవిద్యను పాసించిన వారేయని వారి రచనలను బట్టి తెలుయుచున్నది. గౌడపాదా చార్యులు గైడపాదస్తూమను నోక గ్రంథమును సుభగోయస్తుతి యనునొక స్తోత్రముకు రచించినారు. శ్రీశంకరాచార్యులు సౌందర్యలహర్యాది శ్రీవిద్యాతత్త్వ నిరైపక స్తోత్రముల నెన్నింటినో రచించినారు. ఐదువందల యేబదియై సంఖ్యతో పంచదశీ విద్యాత్మకతను సూచించు బ్రహ్మ సూత్రములకు భాష్యమును రచించినారు. శ్రీ విద్యారణ్యులు పంచదశీ విద్యాత్మకతను సూచించుటకై తమ వేదాంతగ్రంథమునకు పంచదశీయని నామము నెన్నుకొనినారు. కల్యాణ సృష్టిస్తవమను నామాంతరముగల పంచదశీ మం&రతాక్షరములతో నారంభింపఁబడిన పంచదశీ స్తోత్రమును శ్రీశంకరాచార్యులు రచించినారని, కొందరు శ్రీవిద్యారణ్యులు రచించినారని మరి కొందరు తలంచుచున్నారు. వారు స్థాపించిన అద్వైత పీఠములయందలి యాచార్యులందఱును నేటి వరకును శ్రీచక్రార్చాన చేయుచు శ్రీవిద్యోపాసకులుగానే యున్నారు.

తెలుగు దేశమున షొడశిర్యైన శ్రీకారము చుట్టుట తోడనే అక్షర లేఖనాభ్యాసము బాలురచే గురువులు చేయించుట పరంపరగా వచ్చిన యాచారమ్మై యున్నది. శుభఖర్మలకు సంబంధించిన

వ్యవహారమంతయు శ్రీకారముతోడనే యారంభమగుట సర్వసాధారణమగనున్నది. తొలి తెలుగు కవులందఱు శ్రీకారముతోడనే తమ గ్రంథముల నారంభించి యున్నారు. నేటి కవులలోను కొందఱట్లు చేయుచునేయున్నారు. జైనాద్య వైదిక తంత్రములపై తత్సాహిత్యములపైనను శ్రీవిద్యాప్రభావము గనం బడుచున్నది.

శ్రీమద్బ్రహ్మాండ పురాణమున హయగ్రీవాగస్త్య సంవాదమునందు శ్రీలలితా దివ్యసహస్రనామ స్తోత్రమున శ్రీదేవీ సౌందర్య మతిరమణీయముగ ప్రతి పాదింపబడినది.

సౌందర్యము అంతస్సౌందర్యము. బహిస్సౌందర్యము అని రెండు విధములుగ నుండును. అంతస్సౌందర్యము సచ్చిదానంద స్వరూపము. బహి స్సౌందర్యము నామరూపాత్తకము. బ్రహ్మము సచ్చిదానంద రూపము. జగత్తు నామారూపాత్మకము. ఈ యుభయము సౌందర్యమేజ సౌందర్యమునకు పర్యాయమే లాలిత్యము. లలిత యొక్క ధర్మము లాలిత్యము. సుందరి యొక్క ధర్మము సౌందర్యము. సచ్చిదానందమయ బ్రహ్మము శ్రీలలితా సుందరి యొక్క అంతర్గత స్వరూపము. నామారూపాత్మక జగమామె బాహ్యరూపము.

నామరూపము లన్నియు నా శ్రీదేవి యొక్క బాహ్య సౌందర్యమునకు చెందినవేయైనను, ప్రారంభమున కొన్ని నామములు రూపములు యొ&రతమే యా భగవతీ సౌందర్యమునకు చెందినవిగా భావించి యుపాసించుట సనాతనాచారము. నామ రూపములు రెండును ఉపాసనా ప్రతీకములేయైనను, నామావృత్తి రైపమైన జపమున రూపధ్యానము విగ్రహారాధన సమయమున సహస్రశత చతుర్వింశత్యాది సంఖ్యక నామావళి పఠనమును ఆచారము లగుటచే రుచిభేదమున వాని యంగాంగా భాగము కల్పింపబడుచుందును. నామ రూపములలో నామము నుండియే రూపము జనించినదను సిద్ధాంతము ననుసరించి నమమునకు ప్రాధాన్యముండటచే రూపప్రతీకమునకన్న నామప్రతీకము శ్రేష్ఠమగును. ఉపనిషత్తులోని ఓంకార ప్రతీకోపాసనా ప్రాధాన్యమీ యంశమునకు సమర్థకము. '8తస్యవాచకఃప్రణవ" అనుపాతంజలయోగ సూత్రమోంకారమును భగవద్వాచకముఁజెప్పును. సన్యాసులకును విడువరాని దగుటచే దానికన్నమించిన మంత్రము లేదనుటయు ప్రసిద్ధమే. కాని ఏనామమైనను భగవద్వాచకముగా భావించినప్పుడు మంత్రమగుచుండటచే శ్రీలలితా సహస్ర దివ్యనామస్తోత్రము బహునామ ఘటితమగుటచే మాలామంత్రముగా పేర్కొనఁబడుచున్నది.

శ్రీదేవీ మంత్రమగు షొడశాక్షరి శ్రీషొడశాక్షరీ విద్యగా శ్రీవిద్యగా శ్రీలలితా సహస్రనామ స్తొత్రమున పేర్కొనఁబడినది. ఈ స్తోత్రము శ్రీచక్ర విజ్ఞానమును గూడ చక్కగా వివరించును. శ్రీచక్రము శ్రీదేవియొక్క బ్రహ్మాండాత్మకరూపమునకు పిండాత్మక రూపమునకు షొడశాక్షరవిద్యకును సంకేతమగుటచే శ్రీచక్ర విజ్ఞానము గూడ శ్రీవిద్యయని వ్యవహరింపబడును.

శ్రీ విద్యాప్రతిపాదక గ్రంథములు పెక్కులున్నను శ్రీశంకర భగవత్పాదులవారి సౌందర్యలహరి సంగ్రహముగాను రమణీయముగను శ్రీవిద్యను వివరించును. ల స. నా. స్తోత్రమువలె నీ సౌందర్యలహరియు ఎదేవియొక్క కేశాది పాదాంతరూప సౌందర్యమును అతి మనోజ్ఞముగ వర్ణించును. సచ్చిదానందాత్మకమగు అంతస్సౌందర్యమును గూడ ప్రతిపాదించును. అందుచేత శ్రీశంకరులు తమసౌందర్యలహరిని శ్రీలలిత సహస్ర దివ్యనామస్తోత్ర సారముగా సమకర్చినట్లు భావిచుట కవకాశము కలిగినది. ఈ రెండు గ్రంథములను తులనాత్మకముగ పరిశీలించినపుడు శ్రీశంకరులు ల.స.నా. స్తోత్రమును నిరంతరము పఠించి జపించి భావించి రచించినట్లు స్పష్టమగున.

సౌందర్య లహరిలో మొదటి నలుబదియొక శ్లోకములు ప్రధానముగ శ్రీవిద్యను వివరించును. మిగిలిన శ్లోకములు ప్రధానముగ శ్రీదేవీ రూప సౌందర్యమును వర్ణించును. శ్రీవిద్యను వివరించు మొదటి నలుబదియొక శ్లోకములు శంకరులచే కైలాసమునుండి పంచలింగములతోబాటు తేఁబడినవి. అవి శంకర రచితములు కావని వాని కానందలహరియను వ్యవహారము కలదనియు సంద్రాయజ్ఞులు చెప్పెదరు. కాని మొత్తము శ్లోకములకును సౌందర్యలహరీ వ్యవహారమే రూఢమై యున్నది. తొలుతచెప్పన విధముగ సచ్చిదానంద స్వరపము గాని శ్రీవద్యగానిర, రూపముగాని సౌందర్యాంతర్గతములే యగుటచేత రూఢమైన వ్యవహారము సమంజసమనియే భావింపవచ్చును.

లలితా సుందరీ, లాలిత్యసౌందర్య శబ్దముల యేకార్థరూప సంబంధమును గమనించినప్పుడు సహస్రనాస్తోత్రమందలి శ్రీలలితా లాలిత్యమే శ్రీసౌందర్యలహరిగా శంకరులచే ప్రవహింపఁ బేయఁబడినదని స్ఫురింపకమానదు.

ల,స.నా. స్తోత్రమందలి యనేకశబ్దములు యధాతథములుగను స్వల్పమైన మార్పుతో కూడియును సౌందర్యలహరియందు గోచరించును. అనేక శబ్దములకు పర్యాపదములు కనఁబడును. కొన్నినామముల యర్థము విస్తరింపబడుటయో సంగ్రహింపబడుటయో భాసించును.

శ్రీశంకరు ల.స. నామ పారాయణమును ముగించిన వంటనే సౌందర్యలహరిని రచించుట కారంభించినారేమో యనిపించును. ల.స.నా. స్తోత్రమందలి చివరినామము శివశక్త్యైక్యరూపిణీ (999) అనునది, సౌందర్యల హరిలోని ప్రథమ శ్లోకము "శివఃశక్త్యాయుక్తో" యని ఆరంభింపబడినది. శివశక్తులయోగమ భేదరూపముకాదు. ఐక్యరూపమే. ఒకవేళ యోగమెప్పుడును భిన్నవస్తువులకూ యనిభావించినచో శివశక్తులకు ఆయోగమేకలదు కాని యోగములేదు. శివశక్తుల యోగము నియుక్తులకు కలుగు యోగము కాదని ఆకార ప్రశ్లేషావకాశము. ఈ శివశక్తుల యోగమునిత్య యోగమేయని ఆకార ప్రశ్లేషావకాశము సూచించును. భేదమునే యంగీకరింపని శంకరులు శివశక్తులు భిన్నములని వానియోగము భేదరూపమని యంగీకరించెదరనుకొనుట యసం భావ్యమగుటచే అనిత్యయోగము భేదరూపము కాదని ఐక్యరూపమే యనియు నీ ప్రశ్లేషావకాశములు వ్యంజింపఁ జేయుచ్నువి.

పారమార్థికమైన అదిశక్త్యైక్యమే శివశక్తులు ప్రకాశవిమర్శములు ధర్మిధర్మములుగ వ్యవహరింపబడుచు శివుడు శక్తి యుక్తుడగుటచేతనే సృష్టించుటకు శక్తుడగుచున్నాడు. లేనిచో కదులుటకును సమర్థుడు కాజాలడు ఇత్యాదిసృష్ట్యాది సమస్త వ్యవహారములకును హేదువగుటచే అభిన్నులైన శివశక్తుల యొక్క భేదరూపయోగ వ్యవహారమునకును హేతువనిభావించుట శాంకరసిద్ధాంతానుగుణము.

ఇట్లు శివుడు శక్తి భిన్నుడుకాక శక్తి స్వరూపడగుటచేతనే సృష్టియాతని నుండి యేర్పడును. కానిచో కదలికయు కలుగదు. సర్వశక్తి నిలయమైన శివ స్వరూపమగు నాయాదిశక్తినే బ్రహ్మా విష్ణు మహేశ్వరులును ఆరాధించెదరు. అట్టి యాదిశక్తి తనకుగల శక్తులన్నింటికిని మూలమనిగుర్తించి నమస్కరించుటకుగాని స్తుతించుటకుగాని అనేకజన్మార్జిత పుణ్యమువలన గలిగిన చరమజన్మమునగాని అవకాశములభింపదు. అనునీ ప్రథమ శ్లోకార్థమునకు శివశక్త్యైక్యరూపిణి(999) బ్రహ్మోపేంద్రమహేంద్రాది దేవసంస్తుతవైభవా (83) శివారాధ్యా (406) పుణ్యలభ్యా (583) పుణ్యశ్రవణకీర్తనా (544) నామములు మూలములనుట స్పష్టము.

శ్రీశంకరులు నిరంతర మీస్తోత్రమును పఠించు చుండువారనుటకు నిదర్శనము ఈ స్తోత్రము నందలినామములు యధాతథముగ సౌందర్యలమరి యందు కనబడుట కాదనరాదు.

తొంబదియెనిమిదవ శ్లోకమున నిస్సీమహిమా (429) మహామాయ (215) నామములు యధాతథముగ కన్పడును.

శ్లో॥ గిరామా హుర్దే వీంద్రుహిణ గృహిణీ మాగమవిదో
హరేఃపత్నీం పద్మాంహర సహచారీ మ&రది తనయాయ్
తురీయా కాపిత్వం దురధిగమ నిస్సీమ మహిమా
మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మ మహిషి.

మహామాయ యొక్క నిస్సీమ మహిమ దురధిగమముగా విశేషింపబడినది. విశ్వం భ్రమయసి అనుపదములు విశ్వభ్రమణ కారిణీ (889) నామము యొక్క వ్యాసీకరణములు తురీయా శబ్దము తుర్యా (262) నామము యొక్క పర్యాయమ. ద్రుహిణగృహిణీ శబ్దము బ్రహ్మణీ (821) నామార్థకము హరేః పత్నీం శబ్దములు నారాయణీ (298) నామార్థకములు. హరసహచరీమ్ అను పదము మృడానీ (564) నామార్థకము. "గిరామ్" అను బహువచనాంత శబ్దముతో కూడిన దేవీమ్ అను శబ్దమున పరా (366) పశ్యంతీ (368) మధ్యమా (370) వైఖరీరూపా (371) నామార్థములైన చతుర్థి వాక్కులకు ప్రకాశికయగు సరస్వతీ (704) వాగ్వాదినీ (350) వాగధీశ్వరీ (640) మహాదేవి (209) ప్రతిపాద్యయగు మహాసరస్వతీదేవియే ప్రతిపాదింపబడినది. పద్మాశబ్దము మహాలక్ష్మి (210) నామమునకు, అ&రదితనయా శబ్దము గౌరీ (635) నామమునకు పర్యాయములు.

ఇట్టి శ్లోకమునందలి పెక్కుపదముల విడివిడిగా అయానామములను ప్రతిపాదించుట గమనింపబడినది. మొత్తముగా కూడ నీ శ్లోకము శారదారాధ్యా (124) కటాక్ష కింకరీభూత కమలాకోటి సేవితా (590) శివారాధ్యా (406) నామములచే సూచింపబడిన ముగురమ్మల పూజలనందు మూలపుటమ్మ యగ మహాకామేశ మహిషిని ప్రతిపాదించుట కూడ గమనింపదగినది. ఇట్టివే మరొకొన్ని శ్లోకములును.

శ్లో॥ విశాలా కల్యాణీ స్ఫుటరుచిర యోధ్యాకువలయైః
కృపాధారాధారా కిమపి మధురా భోగవతికా
అవన్తీ దృష్టిస్తే బహునగర విస్తార విజయా
ధ్రువంత త్తన్నామ వ్యవహారణ యోగ్యావిజయతే.

ఈ శ్లోకము నందును కళ్యాణీ (324) యోగ్యా (655) విజయా (346) నామమలు యధాతధముగా కన్పడును. కాని అమ్మవారికి గాక అవి అమ్మవారి దృష్టికి విశేషణములుగా కూర్చబడినవి. విశాలాశబ్దము విశాలాక్షీ (936) నామైకదేశమే యని దృష్టి విశేషణత్వమున నిర్ణయించుకొనవచ్చును. ఇంతేగాక స్ఫుటరుచి శబ్దము తేజోవతీ (451) ద్యుతిధరా (768) నామములను అయోధ్యా శబ్దము సర్వానుల్లం ఘ్యశాసనా (995) నామమును కృపాశబ్దము రాజత్కృపా (687) నామమును దారాశబ్దము దారాశబ్ద ఘటితములైన సర్వాధారా (659) ధర్మాధారా (884) నామములను మధురాశబ్దము స్వభావ మధురా (915) నామమును భోగవతీ శబ్దము భోగినీ (291) నామమును అవన్తీశబ్దము రక్షాకరీ (317) నామమును నగరశబ్దము బహునగర విస్తార విజయా సమాన మధ్యగలవై శ్రీమన్నగారనాయికా(56) నామమన స్పష్టముగ స్ఫురింపచేయును.

శ్లో॥ క్వణత్కాంచీదామ కరికలభ కుంభస్త ననతా
పరిక్షీణామధ్యే పరిణత శరచ్చంద్ర వదనా
ధనుర్బాణాన్ పాశంసృణిమపి దధానాకరతలై :
పురస్తాదాస్తాంనః పురమథితురాహో పురుషికా,

ఈ శ్లోకమున రత్నకింకిణికారమ్య రశనాదామ భూషితా (38) రణత్కింకిణి మేఖలా (312) నామములు క్వణత్కాంచీదమగా స్తనభార దలన్మధ్య పట్టబంధవలిత్రయా (36) నామమందలి ప్రధామార్థము కరికలఢ కుంభస్త ననతగా తలోదరీ (847) శాతోదరీ (130) నామములు మధ్యే పరిక్షీణగా శరచ్చంద్రనిభావననా (129) రాకేందువదనా (314) నామములు పరిణత శరచ్చంద్రవదనగా సంగ్రహింపబడినవి. మడవ పాదమున రాగ స్వరూప పాశాఢ్యా (8) క్రోధాకారాంకు శోజ్వలా (9) మనోరూపేక్షుకోదండా (10) పంచతన్మాత్రసాయకా (11) నామములు సంగ్రహింపబడినవి. ధనుర్బాణ పాశాంకుశముల యొక్క మనః పంచతన్మాత్రరాగ క్రోధరూపత్వము మాత్రము భావుకుల భావనకు విడువబడినది. నాల్గవపాదమున శివదతిః (405) అతిగర్వితా (508) గర్వితా (856) నామార్థము వివరింపబడినది.

శ్లో॥ సుధా సింధోర్మధ్యేసుర విటపివాటీ పరివృతే
మణిద్వీపే నీ పోపవనవతి చింతామణిగృహే
శివాకారేమంచే పరమశివ పర్యంకనిలయామ్
భజంతిత్వాం ధన్యాః కతిచన చిదానందలహరీమ్

ఈ శ్లోకమున సుధాసాగర మధ్యస్థా (61) అను సమస్త నామము సుధాసింధోర్మధ్యే అని వ్యస్తభావము భజించినది. చింతామణి గృహాంతస్థా (57) అనునామము చింతామణి గృహే అనురూపు ధరించినది. కదంబవన వాసినీ(60) అను నామము నీపోపవనవతి అను విశేషణముగా నవతరించినది. శివకామేశ్వరాంకస్థా (57) నామము పరమశివ పర్యంక నిలయగా పరిణత మైనది. పంచప్రేత మంచాధిశాయినీ (947) నామము శివాకారే మంచే అను పదములుగా మారినది. అంతర్ముఖసమారాధ్యా (870) నామార్థము ధన్యాఃకతిచన భజంతి అనుపదములచే ప్రస్తుతింపబడినది.

సృష్టి కర్త్రీ (264) బ్రహ్మరూపా (205) గోప్త్రీ (266) గోవిందరూపిణీ (267) సంహారిణీ (268) రుద్రరూపా (269) తిరోధాన కరీ (270) ఈశ్వరీ (271) సదాశివా (272) అనుగ్రహదా (273) పంచకృత్య పరాయణా (274) అను పదనొకండు నామార్థములను క్రమముగ

శ్లో॥ జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేతత్ స్వమపీవపురీశస్తి రయతి
సదాపూర్వః సర్వంతతదిదమను గృహ్ణాతి సశివ
స్త వాజ్ఞా మూలంబ్యక్షణ చలితయోర్భ్రూలతికయోః

అను శ్లోకము సూచించుచు పంచబ్రహ్మ స్వరూపిణీ (250) నామార్థమును సమర్థించు చున్నదనుట నిస్సందేహము.

సౌందర్యల మరిలోని సంబోధనాంత పదములకు లలితా సహస్ర నామస్తోత్ర మందలి నామములు నామార్థములు ఆధారములనుటపై పరిశీలనము వలన స్పష్టపడును.

ఈ క్రింది నామములు శ్రీదేవి సంబోధనములుగా ఈ క్రింది సంఖ్యలుగల శ్లోకములలో కూర్చబడినట్లు గోచరించును. జననీ (823):- 39, 17, 28, 32, 51, 64, 76, 77, 87, 103. భవాని(11, 27:-22.) శివా (53): 25,) 43, 57, 77, సతి (820): 26, 97. నిత్యా (136): 30, 33, 102. భగవతీ(279):- 34. పార్వతీ (246):- 81. అపర్ణా (754):- 56, శర్వాణీ (125): 60, ఉమా (634): 47, 71, 99. అంబా(985): 74. మాతా (457): 65, 84, 100.

సౌందర్యల హరి యందు కూర్చబడిన పై నామముల సంబోధనములు ల.స.నా. స్తోత్రమందలి పెక్కు నామములను సమాహరించుట నీ క్రింది విధముగా నూహించుకొనబచ్చును. పది పర్యాయములా వృత్తమైన జనని యను సంబోధనము, జనున్యుత్తర పదములైన మూడు నామములను:- ఆ బ్రహ్మకీట జనని (285) అనేక కోటి బ్రహ్మాండ జననీ(620) వేదజననీ (338) జగజ్జనీత్వ ప్రతిపాదకములైన మూడు నామములను:- వియదాది జగత్ప్రసూః (550) జగతీ కందా (325) విశ్వగర్భా (637), జగదాది వియజ్జన నీత్వ ప్రతిపాదకమైన యొక&క నామమును:- వియత్ప్రసూః (837) కేవల జననీత్వ ప్రతిపాదకములైన మూడు నామములను:- త్రిరావృత్తమైన మాతః అను సంబోధనము మాతృ శబ్దోత్తర పద నామమములను:- ( శిమాతా (1) సిద్ధమాతా (473) గోమాతా (605) వీరమాతా (836) విశ్వమాతా (934)) చతురావృతమైన శివేయను సంబోధనము శివా శబ్దోత్తర పదనామము నొకదానిని శివార్థక నామములు మూడింటిని మొత్తము నాలుగు నామములను:- (శ్రీ శివా (998) సర్వ మంగళా (200) మంగళా కృతిః (933) శోభనా (462)) త్రిరావృత్త మైన నిత్యే అను సంబోధనము నిత్యార్థక నిత్యా శబ్దార్థ పర్యాయరూప త్రివిధనామములను:- (నిర్నాశ (180) నిరపాయా (186) నిరత్యయా (187) మృత్యుమథనీ (181) అనాదివిధనా (296) నిత్యాశోడశికారూప(391) శాశ్వతీ (951)) త్రిరావృత్తమైన త్రివర్ణ ఘటితమైన ఓంకార ప్రతిరూపమైన ఉమా నామము యొక్క ఉమేయను సంబోధనము క్రమముగా త్రిపురాదిత్ర్యక్షర్యంత త్రిశబ్ద ఘటిత సన్నిహిత నామములను, అంబయను సంబోధనము అంబాపద సబంద్ధ నామములను:- త్రిపురా (626) త్రిజగద్వంద్యా (627) త్రిమూర్తిః (628) త్రిదశేవ్వరి (629) త్ర్యక్షరీ (630) అంబికా (295) త్రిపురాంబికా (976) రాకిన్యం బాస్వరూపిణీ (491) లాకిన్యం బాస్వరూపిణీ (503) సాకిన్యం బాస్వరూపిణీ (520) యాకిన్యం బాస్వరూపిణీ (534) భగవతి అను సంబోధనము భగ శబ్దార్థ ఘటితమైన నామము నొక దానిని :- (సుభగా (76:)) భగ శబ్దార్థ వివరణ రూపమైననామమునొక దానిని సమాహరించును :- (షాడ్గుణ్య పరిపూరితా (387)).

సౌందర్యల హరిలోని 102వ శ్లోకములోని పెక్కు సంబోధనములు పెక్కు మూల నామములను వర్ణ సాదృశ్యమున స్మరింపజేయును.

నిదే :- భక్త నిధి: (567), నిత్యస్మేరే: నిత్యతృప్తా (566), నిరవధిగుణే:- గుణనిధిః (604), నీతినిపుణే:- దండనీతిస్థా (608), నిరాఘాటజ్ఞానే :- విజ్ఞాన ఘనరూపిణీ (253) నియమ పరచిత్తైక నిలయే:- సర్వాంతర్యామినీ (819) నియంత్రీ (568), నియత్యా నిర్ముక్తే : విశృంఖలా (834), నిఖిల నిగమాంతస్తుత పదే:- సర్వోపనిష దుద్ఘుష్టా (552): నిరాతంకే :- నిర్వికల్పా (176)

ల.స.నా. స్తోత్రములోనిధరసుతా (956) నామమున కెన్ని వేషములు శంకరులచే వేయబడినచో ఈ క్రింది సౌందర్యలహరీ శ్లోక సంబోధనముల వలన తెలియును.

గిరిసుతే (67, 78, 82, 83) హిమగిరిసుతే (6, 42) అచల తనయే (76) తుహీన గిరికన్యే (12) గోత్రాధరపతికులో త్తంస కలికే (52) తుహినగరి వంశ ధ్వజపటే (61) నగపతాపతాకే (73) ధరణి ధరకన్యే (75) ధరణిధరరాజన్య తనయే (55) అగ రాజన్య తనయే (58)

మఱికొన్ని సంబోధనము మఱికొన్ని నామములు సౌంధర్యలహరీ లలితా సహస్ర నామ స్తోత్రములకు గల సన్నిహిత సంబంధమును తెలియజేయును. (53) ఈశానదయితేః శివప్రియా (409) మృడప్రియా (211), (54) పశుపతి పరాధీన హృదయేః (35) శివపరా (410), (19) హరమహిషి (98) పరబ్రహ్మ మహిషిః మహా కామేశ మహిషి. (233), శివయువతిజ శాంభవి(122) శాంకరీ (126), (72, 80) దేవీః మహాదేవి (209), (89) చండిః చండికా (750), (97) సతిసతీ నామ చరమేః సదాశివ ప్రతివ్రతా (709) సాధ్వీ (108), (91) చారు చరితేః దురాచార శమనీ (191) సదాచార ప్రవర్తికా (356) (62) సుద్దతి: శుద్ద విద్యాంకురాకార ద్విజ పంక్తి ద్వయోజ్వలా (25)

ఈ క్రింది 32వ శ్లోకములోపాముద్రోపాసిత పంచదశాక్షరహాది విద్యను బోధించుట ద్వారా లోపాముద్రార్చితా (647) నామమును వ్యంజింపఁ జేయుటయే కాక బీజసం కేతముల ద్వారా ఈ క్రింది నామములను సైతమ స్ఫురింపచేయును. శివః(హ) శివా (53), శక్తిః (స) పరాశక్తిః (572), కామః (క) కామకోటికా (589) క్షితిః (ల) ధరా (955)

అధ శబ్దము వాగ్భవకూట సమాప్తి పూర్వకముగా మధ్యకూటా రంభమును బోధించుటచే శ్రీ మద్వాగ్భవ కూటైక స్వరూప ముఖ పంకజా (85) కంఠాధః కటి పర్యంత మధ్యకూట స్వరూపిణీ నామార్థములను వ్యంజింపఁజేయును.

రవిః (హ), రవిప్రఖ్యా (596), శీత కిరణ: (స): రాజ్ఞీ (306). స్మరః (క): కామసూవితా (587). హంసః (హ): మిత్త్ర రూపిణీ (505). శక్రః (ల): సహస్రాక్షీ (283) తదను శబ్దము శక్తి కూటారంభమును సూచించుటచే శక్తికూటైక తాపన్న కట్యధోభాగధారిణీ (87) నామమును వ్యంజింపఁ జేయును.

పరా (స). పరా (366). మార (క): రతిప్రియా (316): హరయః(ల) వజ్రిణీ (944) అమీహృల్లేఖా భిస్తసృభి రవసానేషు ఘటితాః అను మూడవ పాదము ఈ మూడు కూటములు హ్రీంకారముతో ముగియునని బోధించుచు హ్రీంకారి (301), త్రికూటా (588) నామములను స్ఫురింపఁ జేయును. మొత్తము మీద నీ శ్లోకము మూల మంత్రాత్మికా (83) మూల కూటత్రయ కళేబరా (89) నామార్థమును వివరించును. ఈ శ్లోకము మొదటి శివశక్తి కామపదములు “క, ఏ, ఈ” అను కాది విద్యా ప్రథమాక్షర త్రయమునకు బోధకమలను సంప్రదాయము కూడ కలదు. ఈ సంప్రదాయము ననుసరించుటలో ల.స.నా. స్తోత్రమునందలి త్రికూటములను బోధించు పై మూడు నామములలో వాగ్భవ కూటము మాత్రమే శ్రీమత్ అని అవిశేషింపబడుటచే గుప్త షొడశియగు ఈ ఈకారము గూడ గుప్తముగా ప్రశ్లేషింప బడినదని భావింపబడ వచ్చును. హాది విద్యకన్న కాది విద్య శ్రేష్ఠమని శ్రీ విద్యైవతుమంత్రాణాంతత్రకా దిర్యధాపరా అని ల.స.నా స్తోత్ర పూర్వ పీఠిక తెలియ జేయుచున్నది.

ఈ క్రింది 33వ శ్లోకము అగస్త్యోపాసితమైన యీ కాది విద్య నుద్ధరి చుచున్నది.

శ్లో॥ స్మరం యోనిం లక్ష్మీం త్రితయ మిద మాదౌ తవ మనో
ర్నిధాయైకే నిత్యేనిరవధి మహా భోగ రసికాః
భజంతిత్వాం చింతామణి గుణిని బద్ధాక్ష వలయాః
శివాగ్నౌజుహ్వంతః సురభిఘృతధారాహుతి శతైః

ఇందలి స్మరయోని లక్ష్మీ పదములు 'క, ఏ, ఈ' అక్షరమునకు సంకేతములు. మిగిలిన అక్షరముల విషయమున హాదికాది విద్యలలో భేధము లేదు. కావున నవి యిందుదద&దరింప బడలేదు. కాది విద్యను జపించు ఫలమిందు చెప్పఁబడుటచే హాది విద్యాఫలము చెప్పఁబడక పోవుటచే కాది విద్య యొక్క పర్వతము శంకరులకును అభిప్రేతమని స్పష్టమగుచున్నది.

సంప్రదాయాంతరము ననుసరించి 32వ శ్లోకమే కాది విద్యోద్ధారక మగుటచే నీ శ్లోకమున స్మరలక్ష్మీ యోని పదములు క్లీం హ్రీం శ్రీం అను బీజాక్షరముల బోధించునని వానిని కాది విద్యాది యందుఁ జేర్చి జపించుట ఫలప్రద మున్నట్లు గాకూడా వాఖ్యానింప వచ్చును.

ఈ పంచ దశాక్షర మంత్రమునకే చివిఱ శ్రీయను బీజమును చేర్చి షోడశాక్షర మంత్రముగా మార్చుట లక్ష్మీధర పండిత సమ్మతము. కాని పూజ్యులు శ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మగారు వార్భవ కూటమందే నాల్గవ ఈంకారము కలదని అదియే పదునాఱవ యక్షరముగా నీ మంత్రము షోడశి యైనదనయు భావించిరి.

ల.స.నా. స్తోత్రమున వార్భవ కూటమే శ్రీమత్ అని విశేషింపఁబడుట చేతను 'పద్మినీ మీం శరణ మహం ప్రపద్యే' అను శ్రీ సూక్త స్రుతి మంత్రము నీం ప్రాధాన్యమును బోధించుట చేతను వీరి భావనకు ప్రామాణికత యేర్పడుచున్నది.

ఎట్లైనను ఈ శ్లోకము శ్రీ విద్యా (575) షోడశాక్షరీ విద్యా (576) నామార్థములను వివరించుననుటలో విప్రతిపత్తిలేదు. ల.స.నా. స్తోత్రమండల సంప్రదాయేశ&రీ సాధ్వీ గురుమండలి రూపిణీ అను శ్లోకార్థ మను సామన్యముగా స్ఫురింపనట్టి "ఈ" గూఢముగా కలదని సాధు (711) ఈ (712) నాదుద్వయ పరముగా సాద్వీశబ్దమును వ్యాఖ్యాకారులు వ్యాఖ్యానించినారు. అందుచేతనే కాబోలు ఈ గుప్త షోడశి ఈ శ్లోకముననుగుప్తముగానే యుంచఁబడినదని ఒకే ఒక ఈ కారము తప్ప రెండుమూడు ఈ కారములు లేక పోవుటచేత నిశ్చయించు కొనవచ్చును.

లలితా సహస్రనామ స్తోత్రమందలి ప్రథమ ద్వితీయ తృతీయ నానుములు శ్రీ మాలా శ్రీమహారాజ్ఞీ శ్రీ మత్సింహాసనేశ్వరీ అనునని లక్ష్మీధర సమ్మతమైన షోడశియగు 'శ్రీం' ప్రాధాన్యమును బోధించును. ప్రథమనామ ప్రథమ పదమగు శ్రీ శబ్దములో శివశక్త్యైక్య రూపిణీ' అను అంతిమ నామాంతిమ పదమగు రూపిణీ శబ్దమును కలిసినచో 'శ్రీ రూపిణీ' అని యేర్పడుటచే ల.స. నామ స్తోత్రము శ్రీ రూపిణియే యని యేర్పడుచున్నది. వీనిలోని శకార రేఫములకు చివరి యీ కారమును కలిసినచో 'శ్రీ' యగుటచే మొత్తము స్తోత్రము 'శ్రీ' యగుచున్నది. 'శ్రీ' యందు ఈ ప్రశ్లిష్టమై యుండుటచే గుప్త షోడశియగు 'ఈ' లీనమై యుండినట్టీ శ్లోకము నందలి 'లక్ష్మీం' అను శబ్దమునను 'ఈ' ల ఐక్యము సాధించును. ఇట్టి శ్లోకము శ్రీ విద్యా పంచదశి శ్రీ షోడశాక్షరీ విద్యయుగుటను గుప్త మైన ఈ కారము ద్వారమున బోదించుచున్నదనుట స్పష్టము. ఈ శ్లోకమందలి మహాభోగరసికా అను పదమునందలి మహాబోగ శబ్దము మహాభోగా (219) నామార్థకమగుటయు స్పష్టమే.

శ్రీ శంకరులు సౌందర్యలహరియందు శ్రీదేవి శరీర సౌందర్యమును నలుబది రెండవ శ్లోకము మొదలు తొంబది యాఱవ శ్లోకమువరకు మొత్తమే బదియారు శ్లోకములలో కిరీటాది పాదాంతముగా వర్ణించిరి. ఈ పద్ధతి ల.స.నా స్తోత్రారంభమున నవలంబింపఁబడిన పద్ధతియే అన్ని శ్లోకములలోను ల.స. నామముల యర్థమును సమ్యగ్భావనా బలమున విస్తరించి మనోహారమగ శంకరులు వర్ణించినారని తౌల్య పరిశీలనమున స్పష్టమగును.

ల.స.నా. స్తోత్రమున కురువిందమణి శ్రేణి కనత్కోంటీరమండితా (14) నామము శ్రీదేవీ కిరీటము మణిగణముతో నొప్పనదిగా వర్ణించును. శంకరులు నలుబది రెండవ శ్లోకమున గగనమణులే (సూర్యులే) మణులుగా పొదుగబడిన బంగరు కిరీటమును వర్ణించినారు. అందలి చంద్రశకలము ఇంద్ర దనుర్బుద్ధిని కలిగించుటకు కనుకమణికాంతులు హేతువులుగా నుత్ప్రేక్షించినారు. ల.స.నా. స్తోత్రమున శిరః స్థితా (591) చంద్రవిభా (592) ఇంద్రదనుః ప్రభా (594) నామములు దేనికది విడిగా శ్రీదేవిని పేర్కొను నట్టివి. ఈ నామముల నుండి బాలచంద్రనిభ పాలస్థ బాలచంద్రుని శిరః కిరీటస్థుని భావము నఖండముగా భావించుట మిక్కిలి రమణీయముగ నన్నది.

కిరీటమును విశ్రాంతి సమయమున తీసివేయగా తెల్లనిపూలతో నల్లని కురులతో ప్రకాశించు శ్రీదేవీ శిరము చంపాక శోక పున్నాగ సౌగంధికల సత్కచా (13) నామమునందువలెనే సౌందర్యహరిలోని 43వ శ్లోకమున వర్ణింపఁబడినది. పై నామమందలి పుష్పములు నీలచికుల (185) యగు శ్రీదేవి నల్లని కురులచే ఇంద్రుని నందనోధ్యానము నుండి సహజ సౌగంధ్యహేతువున తత్ప్రాప్తి కొఱకు ఆకర్షింపఁబడి అందు నివసించుచున్నట్లు త్ప్రేక్షించుట నామార్థమును రమణీయ తరముగ సాక్షాత్కరింపఁజేయుట కొఱకే. నలీని కురులంధకారమును తొలగించు గాక యనుట తమోపహా (361) బంధమోచనీ (546) నామమందలి తమోబంధములు మోక్షప్రతిబంధక జ్ఞానరూపములని చెప్పుటయే.

అష్టమీచంద్ర విభ్రాజదలిక స్థలశోభితా (15) నామమ అష్టమీ చంద్రునివలె లేక అష్టమీ చంద్రునితో ప్రకాశించు ఫాలమును బోధించును. ఈ రెండర్థములను భావించి 46వ శ్లోకమున చంద్రుని యొక్క అష్టమినాటి యా రెండర్థములు సుధా లేపమున తలక్రిందులుగా నతుకఁబడగా శ్రీదేవీ ముఖము పూర్ణబింబముగా దర్శనీయమయినట్లు చెప్పుట విశిష్టముగా నున్నది. రాకాహిమకరః అను పదము రాకేందు వదనా (314) నామమునకు స్మారకముగా నున్నది.

ల.స.నా స్తోత్రమున సుముఖీ (459) నళినీ (460) కామములు సన్నిహితములుగా నున్నవి. కాని వాని యర్థములు మాత్రమే సన్నిహితములుగా కనిపించవు. అట్లే కాలకంఠీ (464) కాంతి మతీ (465) నామార్థవిషయము కూడ కాలకంఠమున కాంతి నూహించికొనినప్పుడు వాని సాన్నిహిత్యము సంజసమే. శ్రీదేవి సుముకి యగుగాక: మఱి నళిని యెట్లగును? అన్న ప్రశ్న మిగిలిపోవును. ఆమె ముఖము నళిన మనుకొనిన ఆమె నళినియగును. కాని నాళము లేనిదే ముఖము నళీన మెట్లయ్యెను? అన్నచో ఆమె గ్రీవము నాళకాంతిని ధరించినదని సమాధానము. నాళములకు కంటకములుండును. గ్రీవమునకు కంటకములు లేనిచో అది నాళ శ్రీధరమగుట యెట్లు అన్నచో శివు నాలింగనమున దానికి కంటకము లేర్పడినవట: ఇట్లీ నాలుగు నామములకు సాన్నిహిత్యము యొక్క సామంజస్యము (68)వ శ్లోకమున సమర్థింపఁబడినది. ఇంతేగాక నళిని మృణాళిని కూడా నగును. శ్రీదేవి కూడ కంఠమున ధరించిన హారలతికతో మృణాళిని యగుచున్నది. మృణాలము జంబాలమలినము శ్రీదేవీ శివమూర్తి (407) యగుటచే కాలకంఠి, ఆ కంఠమందలి కాంతిహారలతికపై పడి దానికి మృణాళీ లాలిత్యము కలిగినది. విభిన్ననామములు రమణీయ సమైక్యభావనమున కది మరొక నిదర్శనము.

ఉన్మేషనిమిషోత్పన్న విపన్న భువనావళిః (281) అను నామము యొక్క యర్థమును ఏబదియైదవ శ్లోకముయొక్క పూర్వార్థమున నిరూపించి ఉత్తరార్థమున జగత్ప్రలయము కలుగకుండుటకే నీచూపులు నిమేషమును పరిహరించినవని యత్ప్రేక్షించుట కాననగును. ఇందలి యత్ప్రేక్ష కరుణారస సాగరా (326) నామార్థభావనా ఫలము. ఇందలి పరిహృతనిమేష శబ్దము దేవేశీ (607) పరదేవతా (369) నామ ప్రతిపాద్య దేవతాత్వభావన నావిష్కరింపఁజేయును.

దరాందోలిత దీర్ఘాక్షీ (601) లోలాక్షీ (454) నామగతశబ్దార్థాను వాదము ఏబదియేడవ శ్లోకమందల "దృశాద్రాఘి యస్యాదర దలిత నీలోత్పలరుచా" అను ప్రథమ పాదమున నీలోత్పలరుచి సమేతమై సాక్షాత్కరించును.

ఏబదియవ శ్లోకమందలి ప్రథమ పాదము 'కవీనాం సంనర్భస్త బక మకరెందక రసికమ్' అనునది. ఇది కావ్యాలాప వినోదిని (613) రసజ్ఞా (799) నామార్థమున కర్ణయుగల పరముగా యోః ఇంచును. ఆ కర్ణయుగలమును నవ (నూతన) రసాస్వాద చాపల్యము గల కటాక్ష వ్యాక్షేపములనెడి తుమ్మెద కొదములతో తాకుచున్న నేత్రమునుదూచి ఫాలనేత్ర మసూయచే నెఱ్ఱనై నదను మిగిలిన మూడు పాదములయందు చేయఁబడిన రమణియమగు నుత్ప్రేక్షచేత కటాక్ష శ్రయములైన నేత్రములకు ఎరుపురంగులేని తెల్లని నల్లని కమలముల తోడి సామ్యము వ్యక్తమగును.

యేబది మడవ పద్యమందలి విభక్త త్రైవర్ణ్యం వ్యతికరిత లీలాంజన తయా అను ప్రథమ పాదము మూడు నేత్రములను మూడురంగులకు నిలయములైనట్లు చెప్పను. అందుచేత పద్మనయనా (247) పుష్కరేక్షణా (805) రాజీనలోచనా (308) నామత్రయ ప్రతిపాద్య త్రివిధకమల సాదృశ్యము స్ఫురించును. ఈ పద్యమందలి మిగిలిన మూడు పాదములందా రంగులు రజస్సత్త్వతమో గుణములని బ్రహ్మ విష్ణు రుద్రులను మరల మరల సృజించు సామర్థ్యము గలవనియు చెప్పటచేత &రతిగునా (984) త్రిణయనా (453) త్ర్యంబకా (767) త్రిగుణాత్మకా (763) నామార్థముల సమైఖ్య భావమును వ్యంజిపజేయును.

ఏబది యొకటవశ్లోకము రససేవధి (800) నామార్థము నష్టరస విధాన దృష్టి పరమునుగా యోజించును. ఏబది రెండవ శ్లోకము తృష్ణా క్షయ రూపమగుటచే విలక్షణమైన శాంతరసమును శివాశ్రితమైన దానిని అష్టరరసని ధాన దృష్టికాశ్రయమైన నేత్రద్వంద్వము పారద్రోలుటను చెప్పుటచే తృతీయమగు ఫాలనేత్రము శాంతరసాశ్రయమని జ్ఞానరూపమని శివరూపమనియు వ్యక్తమగును. ఇంతేగాక అనేత్రములు స్మరశర విలాస కలనములని చెప్పుటచే మన్మథునియయిదు బాణములలో మొదటిదగు అరవింద సామ్యమును వ్యక్తమగును. ఈ శ్లోక సంబోధనమునందలి కలికా శబ్దము ఆనంద కలికా (729) నామమునకు స్మరింపఁజేయును.

నలుబది యెనిమిదవ శ్లోకమీ నేత్రములను సూర్యచంద్రాగ్న్యా త్మకములని అహోరాత్రి సంధ్యాకారకములనియు చెప్పను. ఇందలి అహశ్శబ్దము విశ్వరూపా (256) జాగరణీ (257) నామములను త్రియామా శబ్దము సుప్తా (260) ప్రాజా&ఒత్మికా (261) నామములను సంధ్యా శబ్దము స్వపన్తీ (258) తై జసాత్మికా (259) నామములను నేత్రపరములుగా వ్యాఖ్యానించుచు మహాకలీ (752) నామములచే చెప్పబడు అహోరాత్రి సంధ్యారూప త్రికాలముయొక్క నేత్రకార్యత్వమును వివరించు చున్నది. ఇందలి సంధ్యామ్ అను శబ్దము సంధ్యా (422) నామము యొక్క ద్వితీయ విభక్త్యంతరూపమే. దివసనిశయోః అంతరచలీం అను రెండు సమస్త పదములుగ సంధ్యా విశేషణము దివసనివా ద్వంద్వమునందలి క్రమము ననుసరించి మొదటసాయం సంధ్యను వ్యతిక్రమము ననుసరించి ప్రాతస్సంధ్యను పిమ్మట ఆ ద్వంద్వము నందలి ప్రత్యేక పదముతోడి యన్వయము ననుసరించి మాధ్యాహ్నిక నిశీథ సంధ్యలను సూచించి దరదలిత హేమాంబుజరుచి యనెడి దృష్టి విశేషణ బలమున ప్రాతస్సాయం సంధ్యలయందు సంధ్యా శబ్దమునకుగల రూఢిని తెలుపుచున్నది. ఏబదినాల్గవ శ్లోకమీ నేత్రములందలి అరుణ ధవల శ్యామరుచి సంగమమని చెప్పుచు వామ నయనము యమునానది దక్షిణవయనము గంగానది ఫాలనేత్రము శోణనది యని సూచించుచున్నది.

'స్ఫురద్గండా భోగప్రతి ఫలిత తాటంక యుగలమ్' అను 59వ శ్లోకమందలి ప్రథమ పాదమున గల ప్రతిఫలిత శబ్దము గండస్థలములందలి దర్పణస్వచ్ఛతను తెలుపుటచే పద్మరాగ శిలాదర్శ పరిభావి కపోలభూః (23) అను నామమును తాటంకయు గల శబ్దము తాటంకయుగ లీ భూత తపనోడుప మండలా (23) అను నామమునుండి గూర్కొనబడిన యొత్తు గడను సూచించును. మిగిలిన మూడు పాదములు ఈ రెండు నామములయొక్క సమ్యగ్భావనాఫలమూన ముఖగత మన్మథ చతుశ్చక్ర రథత్వోత్ప్రేక్షను తద్వారా ఆ రథమ నందలి శివరథ సామ్యమును తద్ద్వారా మహావీర మన్మథునకు శివు డోడిపోవునను నంశమును నిరూపించును.

61వ శ్లోకము నవచంపక పుష్పాభ నాసాదండ విరాజిత (19) నామమునందలి నాసాదండము నాసావంశదండమేయని తారాకాంతి తిరస్కారి నాసాభరణ భాసురా (20) నామమందలి నాసాబరణము ముక్తామణియే యని చెప్పి ఆ నాసావంశదండమునుండి జన్మించినదే యీ ముక్తామణియని యీ రెండు నామములు సమైక్యభావనమును తెలుపును.

నవవిద్రుమ బింబ శ్రీన్యక్కారి దనచ్ఛదా (24) నామము నరువది రెండవ శ్లోకము వ్యాఖ్యానించుచు విద్రుమ శబ్దమును విద్రుమలతాఫల పరముగ పూర్వార్థమున యోజించి యుత్తరార్థమున బింబఫలన్యక్కా (తిరస్కా) రమును ప్రతిపాదించును, రదనచ్ఛదశబ్దము ఛందోను గుణతకై దంతచ్ఛదముగా పరివర్తింతమైనది. శోభనదంతములు గలది యను నర్థముగల సుదతియను సంబోధనాంత పదమున కవ్యవహితముగా ద్విరుక్తమైన దంతచ్ఛద శబ్దమునందలి దంతశబ్దము (25)వ నామ మందలి దంత పర్యాయమైన ద్విజశబ్దమును స్మరింపజేయును.

అరువది మూడవ శ్లోకము చారుహాసా (242) మందస్మిత ప్రభాపూర మజ్జత్కామేశ మానసా (28) మహాకామేశ నయనకుముదామహ్లాద కౌముదీ (403) దరహాసోజ్జ్వలన్ముఖీ నామార్థ సమాహరణము.

జపాపుష్పనిభాకృతిః (766) రంజనీ (209) నామార్థము నరువది నాల్గవ శ్లోకము జిహ్వాపరముగా వ్యాఖ్యానించును. తాండూలాపూరితముఖీ (559) కర్పూర వీటికామోద సమాకర్షద్దిగంతరా (26) నామద్వయ సమాహరణ మరువదియైదవ శ్లోకము.

నిజసల్లాపమాధుర్య వినిర్భర్త్సిత కచ్ఛపీ (27) నామార్థను సంధాన మరువది యారవ శ్లోకము. అనాకలితసాదృశ్య చిబుక శ్రీ విరాజితా (29) నామమునందలి అనాకలిత సాదృశ్యము నౌపమ్యరహిత శబ్దముచే పేర్కొని చిబుకమును ముఖముకుర వృంతముగా నిరూపించుట 67వ శ్లోకమున కాన నగును.

ఇట్లే 47వ శ్లోకము సుభ్రూ (461) నామార్థమును మనోహరముగ నుత్ప్రేక్షించును. 69వ శ్లోకము కామేశబద్ధ మాంగల్య సూత్ర శోభిత కంధరా (30) నామార్థ పరిచయమును వ్యక్తము చేయును.

గహజన్మభూః (606) గుహాంబా (706) గుణాంబా (719) నామములు విడివిడిగా కుమార గణనాథులస్త న్యపానమును వ్యజింపఁజేయును. కుమారగణ నాథాంబా (441) నామము వారిరువిరి స్తన్యపాన సాహచర్యమును వ్యంజిపఁజేయును. కుమారుడనగా కుమారస్వామి (స్కందుడు) స్కంద సోదరుడగుట గణనాథుడుగూడ కుమారుడే విరిరువురు మాణిక్యకుతుపముల వంటి శ్రీదేవి

స్తనములయందలి యమృత రసమును గ్రోలి వధూస గరసము నెరుగనివారై నేటికిని కుమారులుగానే యున్నారని 73వ శ్లోకము కుమార శబ్దమును గణనాధునియందును సమన్వయింప జేయును. 72వ శ్లోకముకూడ నీ స్తన్యపాన సాహచర్యమును తెలుపుచు గజముఖుడు స్వకుంభ సాదృశ్యమును గాంచినాడని గణనాధుని జగముఖత్వము యొక్క పరిహాస జనకత్వమును వివరించును. 74వ శ్లోకమున కామేశ్వర ప్రేమ రత్నమణి ప్రతిపణస్తనీ (33) నామమందలి ప్రేమకు నిదర్శనముగా శివుడు గజాసురజంపి వాని కుంభమునుండి రాల్చిన ముత్తెత్తిములతోకూర్చి యొసగిన బింబాధరకాంతి బింబితమైన ప్రతాపవ్యామిశ్రమైన యాతని కీర్తియో యననొప్పు ముక్తాహార మును ధరించిన శ్రీదేవీ వక్షోజ మండలము వర్ణింపబడినది.

శింజానమణి మంజీరమండిత శ్రీ పదాంబుజా (46) నామముచే జెప్పబడిన మంజీరశింజితము మన్మథని నవ్వుగా 86వ శ్లోకమున నుత్ప్రేక్షింపఁబడినది. పదన్యాస పరిచయము గోరి విడువక వెంబడించు హంసలకు పదవికే పమును శిక్షించు పాదకమలము 91వ శ్లోకమున వర్ణింపఁబడుటచే మరాళీ మందగమనా (47) నామార్థము పూర్వపక్షము చేసినట్లైనది. అనగా ఉపమానమైన విరాళము యొక్క యాధిక్యము తిరస్కరింపఁబడినది.

ఈ పాదకమలమునందలి పరమాల్ప ధూళి లేశమున బ్రహ్మ జగత్తుగా సృజించును. విష్ణువు ఆ జగమును మోయును, శివుడు దానిని మెదిపి వంటి నిండ పులుముకొనును. ఈ ధూళి సృతి సీమంత సిందూరీ కృత పాదాబ్జ ధూళికా (289) నామము నందలిది. రెండవ శ్లోకమందీ విధముగా వర్ణింపఁబడిన ధూళికి ఆశ్రయమైన పాదములు 84వ శ్లోకమందలి శ్రుతీనామ్ మూర్ధానోదధతి తవయా శేఖరతయా అను ప్రథమ పాదమున శ్రుతి సతీశేఖర ములుగా పేర్కొనఁబడినవి. శేఖరశబ్దము శిరోభూషణ వాచకము. మణిపుష్పాదులు శిరోభూషణములు అబ్జముకూడ కుసుమమే. శ్రుతిసీమంత సందూర మీపాదాబ్జమునందలి ధూళియే. శ్రుతి సంస్తుత వైభవా (929) అను శ్రుతి పదారబ్దనామమును సర్వ వేదాంత సంవేద్యా (645) అను శ్రుతి శిరోనామక వేదాంత ఘటిత నామమును స్మరింపఁజేయును.

మొత్తము మీద శ్రీదేవి కేశములందు వక్రతమంద హసితమునందు సరళత గాత్రమున శిరీష మార్దవము కుచతటమున శిలాకంఠోరత మధ్యమున కృశ భావము జఘనమున విశాలత అను పరస్పర విరుద్ధ ధర్మములు కలిగి యున్నదని 93వ శ్లోకము చెప్పుటచే సూచింపఁబడిన విరోధాభాసము వ్యక్తా వ్యక్త స్వరూపిణీ (399) విద్యావిద్యా స్వరూణీ (402) క్షరాక్షరాత్మికా (757) పరాపరా (790) ఇత్యాది నామార్తవిరోధా భాసమును వ్యంజింపఁజేయును. ఇందలి నాల్గవ పాదము జగత్త్రాతుంశంభోర్జయతి కరుణా కాచి దరుణా అనునది సర్వారుణా (49) సాంద్రకరుణా (198) నామార్థముల సంయోజింపఁ జేయును. కాచిత్ శబ్దము అరుణ్యములోని సర్వాతివయ భావము కరుణలోని సాంద్రత్వమును మనము చెప్పఁజాలమని వ్యంజింపజేయును.

95వ శ్లోకము శ్రీదేవి యలంకార సామగ్రిని వివరించుచు ముఖ చంద్ర కలకాంభ మృగనాభి విశేషకా (16) నామములోని కలంకాభ మృగనాభి శబ్దములచే చెప్పఁబడిన సాదృశ్యమును కలంకజ కస్తూరీ యని యభేద రూపముగా పరిణమింపఁ జేయును. చంద్రుడు పన్నీరుగా కలలు కర్పూర శకలముగా ఆకసము బొట్టు పెట్టెగా నిరూపింపఁబడుట ఇందలి అపూర్వ విశేషము. 99వ శ్లోకము శంభుమోహినీ (954) నామ వ్యాఖ్యానము.

శ్రీదేవి సింధూర తిలకాంబిత (635) ఆ యంశమును భావించి శంకరులు సృష్టించిన

సౌందర్యలహరీ పరీఆహమున మనము తల మున్కలగుట తప్పదు. ఇట్లు ప్రతి శ్లోకము నుదహరించి నామర్థమెట్లురమణీయ తరముగ విస్తరించి వర్ణింపఁబడినచో చెప్పుచుఁబోయినచో ప్రత్యేక గ్రంథమేయగును.

ఇక ల.స.నా స్తోత్రమందు వర్ణింపఁబడిన షట్చక్ర కమలభేదన శ్రీ చక్రవర్ణనా శ్రీదేవీ స్వరూపధ్యానా ద్యంశములను గూర్చి స్వల్పముగ వివరించి యీ పీఠిక నుపసంహరించెను.

మూలాధారము మొదలు ఆజ్ఞాచక్ర పర్యంతముగల సుషుమ్నామార్గము కులపథమని చెప్పఁబడును. కుండలినీశక్తి అంతవరకు కులయోగిని (95) ఆ తరువాత కుల పథమును భేదించి కులోత్తీర్ణ (714) యగును. ఈ రెండు నామములను వివరించిన తొమ్మిదవ శ్లోకము కుండలినీ (110) నామమును గుప్తముగనే యుంచినది. అయినను ప్రకాశింపఁజేయుచునే యున్నది. ఇందలి నాల్గవ పాదము ' సహస్రారే పద్మే ' అని సహస్రదళ పద్మస్థా (528) నామమును వివరించును. సుధాధారాసారైః అని ఆరంభింపబడిన పదవశ్లోకము సుధాసారాభి వర్షిణీ (106) కులకుండాలయా (440) నామద్వయమునకు వ్యాఖ్యానము.

పదునొకండ శ్లోకము శ్రీ చక్రరాజనిలయా (996) చక్రరాజ నికేతనా (245) నామద్వయమందు శ్రీదేవి శరణ (నివాస)ముగా చెప్పబడిన శ్రీచక్రము నందల కోణముల వర్ణించును. వానిలో ఏర్ధ్వఈర్షములు శాక్తములు అయిదు అధః శీర్షములు శైవములు నాలుగు మూల ప్రకృతు లనఁబడు నీ తొమ్మిది కోణములలో అయిదు శాక్తములనుటచే శ్రీ క ఠార్థ శరీరిణీ (392) నామార్థమును వ్యంజింపఁజేయును. ఈ శ్లోకము చతుర్భిః శ్రీ కంఠైః అని ఆరంభింపఁబడుట ఆ నామసంబంధమును స్పష్టతరము చేయున్నది. పదునాల్గవ శ్లోకము భూమి (మూలాధారమున) యందు 56 జలము (మణిపురము) నందు 52 అగ్ని (స్వాదిష్ఠానము) యందు 62, వాయువు (అనాహితము) నందు54, ఆకాశము (విశుద్ధము) నందు 72, మనస్సు (ఆజ్ఞ) నందు 64 మొత్తము 360 కిరణములకు పైన శ్రీదేవి పాదములుండును అని చెప్పఁబడుటచే 360 చాంద్రమాన సంవత్సర తిథులు సూచింపఁబడినవి. ప్రతి పన్ముఖ్యరాకంత తిథిమండల పూజితా (610) చంద్ర విద్యా (239) నామార్థములతోపాటు కిరణముల కాల స్వరూపత సూచింపఁబడి దేశకాలా పరిచ్ఛిన్న (701) కాల హంత్రి (557) యునగు శ్రీదేవి పాదమునందలి కాలాతీత్వముకూడ వ్యక్తము చేయఁబడినది. ఇట్లీ శ్లోకము శ్రీ చక్ర పిండాండ బ్రహ్మాండ సంకేతమును ల.స.నా. స్తోత్రాను గుణముగా తెలుపుచున్నది.

శ్రీ చక్రమునకు భూపురము ద్వారము వంటిది. అక్కడ అణిమాది సిద్దులుండును. చతుర్ముఖాదులును ఆ అణిమాది సిద్ధులచేతనే తృప్తిపడు వారే యైనచో చంచలేంద్రియులైన వారికామె పాదసేవ యెట్లులభించును. అణిమాది సిద్దులచే ప్రలోభమునందని వారు మాత్రమే యా శ్రీచక్ర గృహాంతర్భాగమున ప్రవేశించి దేవి పాదసేవచేయు సౌభాగ్యము నొందగలరని 96వ శ్లోకము అణిమది సిద్దులు భూపుర ద్వారగతములను శ్రీచక్రవిజ్ఞానాంమును బోధించును.

బ్రహ్మజ్ఞానము పరవిద్య దానినిన పొందగోరి శ్రీవిద్యోపాసనాదులను చేయు భక్తుల కింకను ఆ పర విద్య లేకపోవుటచే వరు అవిద్యులే. అట్టి అవిద్యద్వక్తుల హృదయమందలి అవిద్యాంధకారమును భేదించుటకా శ్రీదేవి తిమిరమిహిర ద్వీపనగరియగునుననుటచే ప్రథమ పాదమున భక్త హార్ద తమో భేదభాను మద్భాను సంతతి (404) నామమును బ్రహ్మజ్ఞానేతర శాస్త్రాది జ్ఞానము గూడలేని జడుల కామెచైతన్య మకరంద స్రుతి ఝురియనుటచే ద్వితీయ పాదమున చిచ్ఛక్తి (416) చేతనారూపా (4170

జ్ఞానదా (643) జ్ఞానవిగ్రహా (644) చిత్కళా (768) ది నామములను దరిద్రులకామె చింతామణి గుణనిక యగుటచే మూడవ పాదమున దౌర్భాగ్యతూల వాతూలా (744) భాగ్యాబ్ధి చంద్రికా (733) రాజ్యదాయినీ (685) సామ్రాజ్యదాయినీ (693) నామములను సంసార జలధి నిమగ్నుల కామె మరరిపు వరాహదంష్ట్ర యనుటచే నాల్గవ పాదమున సంసారపంక నిర్మగ్న సముద్ధరణ పండితా (880) నామములను మూడవ శ్లోకము వివరించును.

శ్రీదేవి పాదములే మోక్షరూపమున అడయమును అనందరూపమైన వరమును ప్రసాదించుటచే నితర దేవతలవలె నామ యభయ వరదముద్రలను ధరింపదని నాల్గవ శ్లోకము భయావహా (121) వరదా (331) వంద్యా (348) త్రిజగద్వంద్యా (627) నామార్థముల వ్యాఖ్యానించును నాల్గవ శ్లోకము.

ఐదవ శ్లోకము పూర్వార్థమున కమలాక్షని షేవితా(568) నామమును ఉత్తరార్థమున కామసేవితా (375) నామమును సాక్షాత్కరింపజేయును. ఇందలి ప్రణత జనసౌభాగ్య జననీమ్ అనుపదము భక్త సౌభాగ్యదాయినీ (108) నామమునకు ఛాయయే.

శ్రీదేవి చతుర్భుజ ఆమె తన చతుర్భుజములయందు ఇక్షు ధనువును పుష్పబాణమలను పాశమును అంకుశమును ధరించియుండును. మ్మథుడును ఇక్షుధన్వియే. పుష్పభాణుడే. చతుర్భుజుడు కాకపోవుటచే పాశాంకుశముల ధరింపలేదు. ఆరవ శ్లోకము మన్మథుని పుష్పధన్విగా వంచవిశిఖునిగా మాత్రము పేర్కొనినది. ఇక్షుధనువును పేర్కొనలేదు. అయినను శ్రీదేవి భక్తుడైన మన్మథుడు శ్రీదేవి సామ్యమును భజించినట్లు స్ఫురింప జేయును. శ్రీదేవివలె కాముడును కామరూపుడు కావున తన రూపమును ఆయుధములను మార్చు కొనుననియు స్ఫురింపజేయును. కావున లోలాక్షి కామరూపినీ (454, 796) నామద్వయమందలి స్వేచ్ఛారూపత్వ మన్మథ సాదృశ్యములు రెండును శ్రీదేవి యందు నిరూపింపబడినట్లైనది.

సరస్వతీ (704) బ్రాహ్మీ (675) నామార్థమును అరుణా (37) నామార్థమును తరుణాదిత్య పాటలా (922) బంధూక కుసుమప్రఖ్యా (964) విద్రుమాభా (891) అరక్త వర్ణా (476) రకత వర్ణా (499) నిజారుణ ప్రభాపూర మజ్జద్బ్రహ్మాండ మండలా (12) నామార్థమును ధ్యానించుటవలన కలుగు వాఙ్మాధుర్య విద్వద్రంజన స్త్రీ వశీకరణ ఫలములు 15 వ 16వ 18వ శ్లోకములలో చెప్పబినవి.

17వ శ్లోకమున ల.స.నా. స్తోత్రర్తులైన వశిన్యాది వాగ్దేవతలతో కూడిన శ్రీదేవి ధ్యానఫలము కావ్య కర్తృత్వమని చెప్పబడినది. 19వ శ్లోకము కామకలారూపా (322) నామార్థ ధ్యాఫలమును 20వ శ్లోకము సుధాసృతి (380) నామార్థ ధ్యానఫలమును 21వ శ్లోకము తటిల్లతా సమరుచి (107) నామమును తటిల్లేఖా తన్వీమ్ అను పదమతో భానుమండల మధ్యస్థా (275) చంద్రమండల మధ్యగా (240) వహ్నిమండల వాసినీ (352) నామార్థమును తపన శశివై శ్వానరమాయీమ్ అను పదముతో షట్చక్రోపరి సంస్థితా (108) వామమును నిషణ్ణాం షణ్ణామవ్యు పరికమాలానాం తవకలామ్ అను రెండవపాదముతో మహాపద్మాటవీ సంస్థా (59) నామమును మహీపద్మాటవ్యామ్ అను పదముతో పరమానందా (252) పరమా (618) పరమోదా (940) నామములను పరమాహ్లాదలహరీమ్ అను పదముతో అహ్వానించు చున్నట్లున్నది.

23వ శ్లోకము శివమూర్తి (407) నామమును 29వ శ్లోకము హరిబ్రహ్మేందస్రేవితా (297) నామమును 30వ శ్లోకము బ్రహ్మాత్మైక్య స్వరూపిణీ (672) నామమును వివరించును. 31వ

శ్లోకము పురుషార్థప్రదా (291) స్వతంత్రా (724) సర్వతంత్రేశీ (725) నామార్థఘటితము 43వ శ్లోకము పరాపరా (790) సామరస్య పరాయణా (792) నామవ్యాఖ్యారూపము 35వ శ్లోకము చిత్కళా (728) ఆనందకలికా (729)సచ్చిదా నందరూపిణీ (700) విరాడ్రూపా (778) సత్యజ్ఞానానందరూపా (791) క్షేత్రస్వరూపా (341) క్షేత్రేశి (342) నామార్థభావనారూపము.

36వ శ్లోకము ఆజ్ఞాచక్రాంతరాళస్థా (103) ఆజ్ఞాచక్రాబ్జనిలయా (521) నామప్రతి పాద్య పరదేవతా ధ్యానఫలమును వివరించుచున్నది. ఇందలి పరిచితాశబ్దము పరదేవతా (366) చిన్మయీ (251) ప్రత్యక్చితీరూపా (362) చిదేకర సరూపిణీ (364) నామస్మారకము.

37, 38, 39, 40, 41 శ్లోకములు విశుద్ధి చక్రనిలయా (406), అనా హతాబ్జ నిలయా ముని మానస హంసికా (816) భక్త మానస హింసికా (372), స్వాధిష్ఠా నాంబుజగతా (507), మణి పురాన్త రుదితా (101) మణి పూరాబ్జనిలయా (495) మూలాధారైక నిలయా (99) మూలాధారాంబుజారూఢా (514) నామ ప్రతిపాద్య పరదేవతా రూప విశేష నామ విశేష ధ్యాన ఫలవిశేషముల వివరించును.

శ్రీ శంకరులు నిష్కాములయ్యు పైన జెప్పఁబడిన వివిధ ధ్యానములు చేసిరి. వాని ఫలములలో నొకటియగు వాగ్దేవి వదన కమల మదు రిమ ధురీనఫణితులు గల ప్రౌఢ కవితా సామ్రాజ్యము నధిష్టించిరి. దానికీ సౌందర్యలహరియే నిదర్శనము. అందుచేతనే దీనియందు వాగ్దేవీ వదనకమలా మోద మధురిమ యాస్వాద్య మానమగుచుండును. శ్రీ లలితా సహస్రనామార్థ ధ్యానము నిష్కాములయెడను ఫలింపకమానదని దీనివలన స్పష్టమగును.

ఇట్లు

భవదీయుడు

**శ్రీ దోర్బల విశ్వనాథ శర్మ**

అష్టాదశ మహాపురాణములలో శ్రీమద్భాగవతము చేరునా, చేరదా అనునదొక మహాప్రశ్నము. ఒక మహాసంశయము. దాని రెండు వైపులును మిక్కిలి పదునైనవి. కత్తెర అంచుల నడుమ చిక్కిన వాడు తెగుట నిక్కము. కాని వాని పదును మాత్రము ఇప్పటికి తగ్గలేదు. శ్రీదేవి భాగవతము శైలి విషయమున ఇతర మహాపురాణములతో మిక్కిలి సామ్యము నొంది యున్నందున దానికే అష్టాదశత్వము (అష్టాదశాన్యత మత్వము) అనునది ఆ సంశయమందొక పక్షము.

శ్రీమద్ (విష్ణు) భాగవతమునకు చెందినదే అది యనునది మఱొక పక్షము. శైలిలోని ఇతర పురాణ వైలక్షణ్యమునకు కారణము. శ్రీ వ్యాసుల మహాపురాణములలో నది చరమ మగుటచే వారి ప్రతిభా ప్రౌఢత్వ ప్రాగల్భ్యముల పరాకాష్ట అందులో గోచరించినందున ఆ కారణముగా దానిని అష్టాదశ మహా పురాణములలో చేరదనుట అసంగతమనునది వారి వాదము యొక్క సారము. శ్రీ దేవీ భాగవతమే వానిలో ఆ మహా పురాణములలో చేరకున్నను శ్రీ మద్భాగవతము అష్టాదశ మహాపురాణ బహిర్భూత మహాపురాణమని నిర్ణయించుకొని ఈ వాదమును పరిష్కరించు కొనునగునని సమన్వయ వాదులా వాదద్వయము నుండి తప్పుకొని యున్నారు.

పురాణములు పంచ లక్షణములు అవి సర్గము, ప్రతి సర్గము, వంశము, మన్వంతరములు, వంశాను చరితము అనునవి ఆ ఐదు లక్షణములు. శ్రీమద్భాగవతము దశలక్షణ సమన్వితము.

"యత్రసర్గో విసర్గశ్చ స్థానమ్ పోషణమ్ ఊతయః" "మన్వంత రేశాను కథే నిరోధో ముక్తిరాశ్రయః"

1. సర్గము, 2. విసర్గము, 3. స్థానము, 4. పోషణము, 5. ఊతలు, 6. మన్వంతరములు, 7. ఆశాను కథ, 8. నిరోధము, 9. ముక్తి, 10. ఆశ్రయము. శ్రీమద్భాగవతముఇతర మహా (ఉప) పురాణ వైలక్షణ్యమునకు దశలక్షణములు కలదగుట కారణము. ఇది శ్రీమద్భాగవతమునకు వైశిష్ట్యమును కలిగించు వానిలో మరొకటి. శైలి యనునది ఈవఱకే ప్రస్తావింపఁబడినది. పై రెండు ఆపాత పఠనము చేతనే గ్రహింపఁబడ దగిన వగుటచే బహిరంగ (ప్రాయ)ములు.

పురాణములన్నియు మోక్షసాధనములుగా కర్మ భక్తి జ్ఞానములను ప్రతిపాదించు ననుట నిర్వివాదము. వానిలో జ్ఞానము సాక్షాత్సాధనము. మిగిలిన రెండు పరంపరా సాధనములు. ఈ అంశము దాదాపు సర్వ మహా (ఉప) పురాణ ప్రతి పాదితము. శ్రీమద్భాగవతము భక్తి జ్ఞానముల రెండింటిని దాదాపు సమీక్షముగా నుంచినది. ముక్తి పరమ పురుషార్థమనుట దాదాపు సర్వమహా (ఉప) పురాణ సమ్మతమై ఉండగా, "యే ముక్తావపిని స్పృహాః (భక్తులు ముక్తి యందును నిస్పృహాలు) అని భక్తి పరమ పురుషార్థత్వమును నిరూపించినట్లుండుట శ్రీమద్భాగవతమునకు వైశష్ట్యాపాదకములలో మరొక అంశము. శ్రీమధుసూదన సరస్వతి ప్రతిపాదించిన జ్ఞానోత్తర భక్తి యోగము యొక్క పరమ పురుషార్థత్వమునకు సర్వోత్కృష్టత్వమునకు పై వాక్యము ఉండుటయే ప్రమాణము.

శ్రీమద్భాగవతమున భక్తి మికి&కలి సహజముగా సులభముగా నిర్వచింపఁబడినది. 'యాప్రీతి రవివే కానాం విషయేష్వన పాయినీ, త్వా మనుస్మరత స్మామే హృదయాన్మాపసర్పతు' నిత్యానిత్య వస్తు వివేకము లేని వారు అనిత్య (సాంసారిక) విషయము లందు ప్రీతి కలిగి యుందురు. ఆ వివేకము గలవారికిని అది పూర్వాను భూతము. ఆ వివేకము గలవారికిని అది పూర్వాను భూతము. ఆ వివేకము నొందిన పిదప పూర్వము వానినేల ఎట్లు ప్రేమించి యుంటినో అను ఆశ్చర్యము కలుగును. పూర్వాను భూత వాసన మరల ఆవైపునకు తన ప్రీతిని మరల్చునేమో అని భయపడుచుందురు. పై శ్లోకమున అట్టి పరిస్థితి రాకుండా రక్షింపుమని భగవానుని గూర్చి చేయు ప్రార్థన మున్నది. దానితోపాటు అవివేక విషయ ప్రీతివంటిదే వివేకుల భగవత్ప్రీతి అని భక్తి స్వరూపము సులభముగా సహజముగా నిర్వచింపఁబడిన

ప్రేమ లక్షణమిందు సాక్షాత్కరించును. ఆ ప్రేమ భగవద్గీతమైనప్పుడే అది ఉపాదేయమై ఆనంద హేతువగు ననుట స్పష్టీకరింపఁబడినది. 'సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా' అను శ్రీనారద భగవానుని నిర్వచనము భాషా రూపాంతమున ఇందు గోచరించును. అవివేకులకు భగవానుడు పట్టడు. వివేకులకు విషయములు పట్టవు, అని భగవత్ ప్రేమకు వివేకముతోడి అవినాభావము ఇందు సూచింపఁబడినది. భగవద్భక్తి లేని వరవివేకులనుటకు సంశయ మక్కఱలేదనియు సూచింపఁబడినది. ఇంత సులభ సహజ నిర్వచన మీ శ్లోకమున గోచరించు చున్నను జ్ఞాన రూపముగా నిందు గోచరించును.

బ్రహ్మ సూత్ర భాష్య మంగళాచరణ శ్లోకమున 'శేముషీ భక్తి రూపా' అని చెప్పిన భగవద్రామానుజులు వివరించిన సప్తాంగక భక్తి ఈ శ్లోకమున గోచరింపదు. కర్మజ్ఞాన పక్ష ద్వయముకల భక్తి (పక్షి) స్వరూపము కూడి ఇందు గోచరింపదు. వారు భక్తి కంగము జ్ఞానము (జీవస్వరూప జ్ఞానము) అని చెప్పినను తైల ధారవలె అవిఛ్ఛిన్నమైన జ్ఞాన ధారయే భక్తిగా అభిప్రాయపడినట్లు తెలియవచ్చును. బహుశః అది దాసోహం వృత్తి సాంతత్యము కావచ్చును.

శంకర భగవత్పాదులు చెప్పిన స్వస్వరూపాను సంధాన రూప భక్తియు పై శ్లోకమున గోచరింపదు. స్వస్వరూపాను సంధానము పరోక్ష జీవ బ్రహ్మైక్య జ్ఞాన ధార (ధ్యానము) పై శ్లోకమున గోచరింపదు.

పరోక్ష జీవ బ్రహ్మైక్య జ్ఞానధార (సొహం) ధ్యానరూపమే కాని అపరోక్ష సోహమ్ చరమ వృత్తి రూపము కాదు. చరమ వృత్తి ఏకమే గాని అది వృత్తి జ్ఞాన ధారా రూపము కాదు.

ఈ శ్లోకమున చెప్పఁబడిన ప్రీతి శ్రీనారదుల నిర్వచనమునకు భాషా రూపాంతరమే అని మరల గుర్తు చేయుదును.

శ్రీ మద్భాగవతమున భక్తి యొక్క నవధాత్వము చెప్పఁబడినది. "శ్రంణం కీర్తనం విష్ణోః స్మరణమ్ పాద సేవనమ్ అర్చనం వందనమ్ దాస్య సఖ్య మాత్మనివేదనమ్" అను శ్లోకమున చెప్పఁబడిన నవ విధములు ప్రీతిగల కర్మలు (లేక అనుభావములు) అనుట సముచితముగా నుండును. ఒకని యందే ఈ అన్ని కర్మలు ఉండనక్కఱ లేదు. వీనిలో ఒకటో రెండో అంత కెక్కువగానో ఉండవచ్చును.

ఇట్టి భక్తి పూర్వజన్మములలోని బహువైదిక కర్మాపూర్వ ఫలముగా చరమ జన్మమున నేర్పడునట్టిది లేక నిర్వ్యాజ భగవత్కృప వలన చరమ జన్మమున నేర్పడునట్టిది. దీని వలన (కోరిక పోయినను లభించు దానిని కోరుట యెందులకు) సాధన చతుష్టయ సంపత్తిలో ముముక్ష చేరవచ్చు గాక. భగవత్ ప్రీతిరూప భక్తి ఉదయించిన వారిక భక్తి సమకాలముననే ఆనందోదయముండుటచే దుఃఖనాశనమును ఉండుటచే ముముక్ష ఉండక పోయినను ఇబ్బంది లేదు.

వాస్తవమున ఈ ప్రీతిలో సోహమ్ భావమం తర్గర్భితమై ఉన్నది. ఈ ప్రీతి స్వగతము ఈ స్వగత ప్రీతి శాశ్వతము. స్వసంబంధిస్వేత రగత ప్రీతి స్వసంబంధ మున్నంత వఱకే కావున అది అశాశ్వతము. అసంపూర్ణము. ఆ సంబంధము కూడా భావనా మా&రతము అనగా కల్పితమునైన మమకారముతో పెనవేయఁబడినది. కావున స్వగత ప్రీతి యొక్కటే సంపూర్ణము. దేహము లందలి అహంకారము కూడా కలి&పతమే యైనందున అశాశ్వతము. శాశ్వతమైన ఆత్మకు అభిన్నమూనది. ఆత్మజ్ఞాన రూపము. పరమాత్మయు జ్ఞాన రూపము. ఉపాధులైన కించిజ్జ్ఞత్వ సర్వజ్ఞాత్వాదులును కలి&పతములే. కావుననే ఉపనిషత్తు 'సత్యం జ్ఞానమనంతమ్ బ్రహ్మ' అని చెప్పగా తదుపరి బృంహణముగా శ్రీమద్భాగవతము 'వదంతి

తత్త్వ విదస్తత్వం యద్ జ్ఞానమద్వయం బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే' (ఏ జ్ఞానమును అద్వయ తత్త్వమునుగా తత్త్వవేత్తలు చెప్పిరో ఆ (తత్త్వ) జ్ఞానము బ్రహ్మ, పరమాత్మ, భగవానుడు అని చెప్పఁబడును. అని చెప్పినది.

ఒక విధముగా శ్రీమద్భాగవతము నందలి భక్తి కుండలినీ శక్తి వంటిది. అది అధిక గుణ శక్తులు కలిగి తనకు భిన్నుడుగా తెలియఁబడిన పరమాత్మ యందు స్వక్షేమమునకై ఆరంభింపఁబడి పరమాత్మ కన్న మరేమియు లేదు. అన్న భిన్నమైన పరమాత్మ (భావన) యందు తనను ప్రవిలాపనము చేసి కొనుటతో ముగియును. జీవ స్వరూపమూలాధారగత కుండలినీ సహస్రారగత శివుని యందు తాదాత్మ్యమును చెందినట్లు భక్తియు జీవగతముగా ఆరంభింపఁబడిన అద్వయ జ్ఞానరూప పరమాత్మ యందు స్వైక్య జ్ఞాన రూపమున ప్రవిలాపన మొందుటలో జ్ఞాన రూపముగా పర్యవసించును. అదియు తదైక్యము నొందును.

అద్వయ జ్ఞాన రూపము నంద గలిగిన ఈ భక్తి జీవన కాలమున చాలా వఱకు భేదాభేద రూపజ్ఞాన ప్రేమ రూపముననే ఉండును. ప్రేమగల వ్యక్తులందఱు మన మందఱ మొకటే అని అనుకొనుచుందురు. వెనుక చెప్పినట్లు ప్రేమ స్వాత్మాభిన్న పరమాత్మ పర్యవసాయియై పరమ ప్రేమ అనఁబడును. సర్వం ఖల్విదమ్ బ్రహ్మ అను ఉపనిషదుక్త జ్ఞాన రూపమై జీవన్ముక్తునిగా జీవునొనరించి దేహావసానమున కైవల్య రూపమగును. ఇట్టి పరమభక్తికి గోపికలు దృష్టాంత రూపులు. కాని వారు సాధారణులు భావించినట్లు అజ్ఞానులు కారు. అఖిల దేహినామంతరాత్మ దృక్ అనగలిగిన జ్ఞాన నిష్ఠలు జ్ఞాన్యగ్రగణ్యలు. ఈ దృశభక్తి నిరూపణము శ్రీమద్భాగవత విశిష్టతయే.

# గీత ఉపనిషత్తులు

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందన
పార్థోవత్ససుధీర్భోక్తా దుగ్ధంగీతామృతం మహత్

ప్రసిద్ధమైన ఈ శ్లోకము శ్రీమద్భగద్గీత ఉపనిషత్సారము అని చెప్పెను. గోపాల నందనుడు ఉపనిసత్తులను గోవులనుగా, అర్జునుని దూడగా జేసి సుబుద్ధి యనెడి భోక్త కొరకై పిలికిన అమృతము శ్రీమద్భవద్గీత. రామగీత, శివగీత, దేవగీత మొదలగు గీతలెన్ని యున్నను గీత యనగానే మహాభారతాంతర్గత భీష్మ పర్వమందలి శ్రీమద్భగవద్గీతయే స్ఫురించును. ఏ గితకును అర్జునుని నిమిత్తముగా జేసికొని శ్రీకృష్ణుడుపదేశించిన ఈ గీతకు వచ్చినంత ప్రసిద్ధి రాలేదనుటకిదియే నిదర్శనము. లోకమున గీతా నామమున ప్రసిద్ధమైన శ్రీమద్భగవద్గీతయే యుపనిషత్సారమని పై శ్లోకము వలన నిశ్చయింపఁబడినది.

ఉపనిషత్తుల సంఖ్య నూట యెనిమిది (108)లో నడిమి సున్నను తొలగింపగా నేర్పడిన సంఖ్య పదునెనిమిది. (18) ఇదియే గీతాధ్యాయ సంఖ్య అధ్యాయములన్నింటి చివర యందును "భగవద్గీతానూపనిషత్సు" అను అధ్యాయాంత గద్య మారంభిపబడినది. గీతలోని యేడువందల శ్లోకములు భగవంతునిచే పాడబడిన యుపనిషత్తులని పై గద్యారంభము స్పష్టము చేయును. ప్రసిద్ధ భగవద్గీత భాష్య కర్తలలో ప్రథములగు శ్రీ శంకరులు "గీతాఖ్యైః సప్తభిః శ్లోకశతైః" (గీత లను పేరుగల ఏడువందల శ్లోకములతో) అని ఏడువందల శ్లోకములు గల గీతా పాఠము యొక్క ప్రామాణ్యమును అంగీకరించిరి. పై గద్యారంభమందలి "ఉపనిషత్సు" అను పదము విశేష్యముగా స్ఫురించుచున్నను వేదాంతములకు

:: 4 ::

ఉపనిషత్తు లను పేరు ప్రసిద్ధమై యుండుటచేత విశేషణమైన భవవద్గీతా పదము విశేష్యమై ఈ యేడు వందల శ్లోకములకు ఉపనిషత్తులను పేరు రాక భగవద్గీతలను పేరు ప్రచారమును పొందినది. కాలాంతరమున ఈ పేరు ఏక వచనముగా భగవద్గీత యని ప్రసిద్ధమైనది.

"ఉపనిషత్" అను పదమునకు సంసార బీజమగు అవిద్యను నశింపజేయున దగుటచేత లేక బ్రహ్మను పొందించునదగుట చేత విద్యయను నర్థమేర్పడినది. ఇట్టి విద్యను ప్రతాపాదించు వర్ణన మహాత్మకమైన గ్రంథమునకును "ఉపనిషత్" అను పదము వాచకమైనదని శ్రీ శంకరులు వివరించిరి. సంసార బీజమగు అవిద్యను నశింపజేసి బ్రహ్మప్రాప్తిని గలిగించు విద్యను ప్రతిపాదించు వేదాంతములకు ఉపనిషత్తులను పేరు ప్రాచీన కాలమున వలె నేటి కాలమునను చెల్లును. అయినను వేదాంతముల నుండి వేరుపరచుటకు భగవద్గీతా నామమే గూఢమైనది.

అధ్యాయాంత గద్యమందలి "బ్రహ్మ విద్యాయాం" అను పదము విశేష్యముగా స్ఫురించుట కవకాశము కలదు. గీత బ్రహ్మవిద్యా బోధకమగుటచే బ్రహ్మ విద్యానామము సార్థకము కూడనగును. కాని బ్రహ్మవిద్య వేదాంతముల యందును ప్రతిపాదింపబడి యుండుటచే భగవద్గీత కాపేరు ఏర్పడలేదు. అట్లే "యోగశాస్త్రే" అను పదమును విశేష్యముగా స్ఫురించుట కవకాశము కలదు. చిత్తవృత్తి నిరోధ రూపాత్మ సంయమ యోగమును ప్రతిపాదించుట చేతగాని కర్మ జ్ఞానాది మోక్షోపాయ ఉపయోగములను ప్రతిపాదించుట చేతగాని నిష్కామ కర్మానుష్ఠాన రూప యోగమును ప్రతిపాదించుట చేతగాని యోగ శాస్త్రనామము సార్థకమని గూడ చెప్పవచ్చును. కాని యోగ శబ్దము పాతంజల యోగ దర్శనమునకు రూఢమగుటచే భగవద్గీత కాపేరు రూఢము కాలేదు.

కాగా పై గద్యమందలి "భగవద్గీతాసు" అన్న మొట్టమొదటి పదమే కాలాంతరమున విశేష్యమై యేకవచన రపము నంది, భగవద్గీతగా ప్రసిద్ధి నందినదని తెలిపోయినది.

భగవద్గీత కన్న పూర్వమే ఉపనిషత్తులు ప్రామాణ్యము రూఢమగుటచే "ఉపనిషత్సు" అన్న పదము విశేష్య స్ఫురణ గలిగియుండుటచే ఆర్.డి.రానడే గారు చెప్పినట్లు ఈ భగవద్గీత సర్వ శాఖీయోపనిషత్తుగా వేదవ్యాసనిచే కూర్చబడిన దోవెూ యని గీతా పాఠకులకు తోచక మానదు. ఇందుకు సర్వోపనిషత్తాత్పర్యమును వివరించుటయే గాక పెక్కు ఉపనిషత్తుల మంత్రములు శబ్దతః అర్థతః అనువదింప బడుట గూడ ప్రధాన కారణముగా స్ఫురించును. అందుచేతనే కాబోలు శంకరాది భాష్య కర్తలు తమ భాష్యములలో ఆయా ఉపనిషన్మంత్రార్థానువాద పూర్వకముగా గీతా శ్లోకముల కర్థవివరణము చేసిరి.

నూట యెనిమిది ఉపనిషత్తుతలో ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఛాందోగ్య, ఐతరేయ, బృహదారణ్యకములను పది యుపనిషత్తులకును శ్వేతాశ్వత రోపనిషత్తునకును అత్యధిక ప్రాధాన్యము కలదు. ఈ ప్రాముఖ్యము శంకరాది భాష్యకర్తలు భాష్యముల వ్రాయుట చేతగాని ఇతరోపనిషత్తుల ప్రాచీనతను ప్రామాణ్యమును కొందరు శంకించుట చేతగాని కలిగి యుండవచ్చును. ఎట్లయిననేమి పై యుపనిషత్తులకు అత్యధిక ప్రాముఖ్యము ఉన్నదనుట మాత్రము సత్యము. భగవంతునిచే చెప్పిబడినందునే వేదమునకు దాని చివరి భాగములైన. సారములైన యుపనిషత్తులకును ప్రామాణ్యము సిద్ధించును అను నొక పక్షము గలదు. ఈ పక్షము నాశ్రయించినచో అర్జునునకు భగవంతునిచేత నుపదేశింప బడినదుగటచే గీతకును ఉపనిషత్తులతో సమానముగా ప్రామాణ్యము సిద్ధించును. స్వతః ప్రమాణమగుట చేతనే వేదమునకు ఉపనిషత్తులకును భగవద్గీత కన్న ప్రామాణ్య పారమ్యము సిద్ధించుననివ మరొక పక్షము కలదు. ఈ పక్షము నాశ్రయించినచో భగవద్గీతకు స్మృతి సదృశ ప్రామాణ్యము సిద్ధించును.

మొదటి పక్షము నాశ్రయించియు పౌర్వా పర్యము ననుసరించి ప్రామాణ్య పారమ్యము ఉపనిషత్తులకు చెప్పవచ్చును. అప్పుడు రెండు పక్షములయందును భగవద్గీతకు స్మృతి సదృశ ప్రామాణ్యము సిద్ధించుటలో విప్రతిపత్తి లేదు. భగవంతుడే కాలానుసారముగ కృష్ణావతారము ధరించినప్పుడు వేదాంతములు భగవద్గీతగా నవతరించిన వనుటలో దోషమేమి? భగవంతుని యవతారమైన శ్రీకృష్ణునకు శ్రీకృష్ణ భగవానుడని వ్యవహారము సమంజసమైనటేప్ల ఉపనిషత్తుల యవతారమైన భగవద్గీతకును భగవద్గీతోప నిషత్తు అను వ్యవహారముకూడా సమంజసమే యగును.

ఉపనిషత్తు లాత్మ బహుత్వమును బోధించును, ఉపనిషత్తులు అత్మైకత్వమునే బోధించును. ఇత్యాది మత బేధములు ఉపనిషత్తులు విషయమునందువలెనే భగవద్గీత విషయమందును గలవు. ఇట్లు ప్రామాణ్య సామ్యము భిన్నమతోత్పాదకత్వ సామ్యము గీతకును, ఉపనిషత్తులకును కలవని స్పష్టపడుచున్నది.